బాలానంద

# నవగ్రహ పూజామహిమ



రచన :

శ్రీ ధూళిపాళ రామమూర్తి

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

నవగ్రహ పూజామహిమ

రచన :

శ్రీ ధూళిపాళ రామమూర్తి

ప్రథమ ముద్రణ :
1997

ముఖచిత్రం :
వి. యస్. ప్రకాష్





వెల : రు. 25-00

ముద్రణ :
బాలాజీ ప్రింటింగ్ ప్రెస్
విజయవాడ-4,

# విషయసూచిక

# నవగ్రహ పూజా మహిమ

ప్రపంచమంతయు సృజించినది పరమేశ్వరుడు. జీవులు కొంత కాలము యీ శరీరములతో నుండి తరువాతనే శరీరములు వదలిపెట్టి యింకొక శరీరమును ధరించి సంచరించెదరుగదా! అందుచే లోకములో జీవులు చావులు పుట్టుకలతో నడచుచుందురు. ఈ శరీరముల మార్పులు మనుష్యులకు, జంతువులకు, సరీసృపములకు అనగా చీమ మొదలు బ్రహ్మ పర్యంతము శరీరములు వదలుట ధరించుట జరుగుచున్న విషయము. ఈ శరీరములతో జీవులుండునది జీవితకాలమందురు. ఈ జీవితకాలము దేవతలకు హెచ్చుగాను మనుష్యాది లోకములలోనివారికి తక్కువ కాలము జీవితము కాలము నడుచును. కాలము యీశ్వర నిర్ణయముతో నుండుగల వ్యవధియందురు. ఆ కాలమును దివ్యులు రక రకములుగా నంతరాంతరములలో భాగములుగా విడదీసి యుంచిరి.

దేవతలకు కాలమానము వేరు, అనగా వారు చేసిన పుణ్యబలముతో చిరకాల సుఖము లా లోకములం దనుభవింతురు. జీవితము అనగా శరీరములు దాల్చి దానిద్వారా సుఖ దుఃఖములు గతములో చేసి పుణ్యపాపముల వల్ల ననుభవించుచు శరీరము వదలుట జీవిత ప్రమాణమందురు. ఆ ప్రమాణము మనుష్య లోకములో నూరు సంవత్సరములు గొప్పకాలము. మనుష్య మానమునకు నూరు రెట్లు అనగా నూరేండ్లు దేవతలకు దినమగును.

దేవతలకు నూరేండ్లు బ్రహ్మకు నొక దినము. బ్రహ్మకు నూరేండ్లు శ్రీహరి కొక దినము ఇట్లు గుణించగా యా నూరేండ్లకు ప్రళయము వచ్చును.

ప్రళయ మనగా సమస్తము జలమయమైపోవుటనబడును. దాని కాలమైన పిదప మరల సృష్టి ప్రారంభమగును.

## గ్రహములు - జ్యోతిర్గణములు

ఇది సృష్టిక్రమము. ఇందులోనే కాలమును భాగములు శాస్త్రవేత్తలు విడదీసిరి. ఆ కాలమును యెట్లు విడదీసిరనగా సంవత్సరము, ఆయనము, ఋతువు, మాసము, పక్షము, వారము, దినము, పగలు, రాత్రి, జాము, ఘడియలు, విఘడియలు, లిప్తలుయని విభాగించిరి. అరువది లిప్తలు విఘడియ, అరువది విఘడియలు ఘడియ, ముప్పది ఘడియలు పగలు, ముప్పది ఘడియలు రాత్రి మొత్తము అరువది ఘడియలు దినముగా నెన్నిరి. అట్టి రోజులు యేడు వారమగును. రెండు వారములు పక్షము. నాలుగు వారములు మాసము. రెండు మాసములు ఋతువు. మూడు ఋతువు లొక ఆయనము. రెండు ఆయనములు సంవత్సరము. అట్టి సంవత్సము లెన్ని యనుభవించిన యన్నియేండ్లు జీవించినట్లు చెప్పబడుచున్నది.

అయితే యిన్ని విభాగములున్న కాలమును యెట్లు నిర్ణయించవలయును. దాని ప్రమాణము యెట్లు తెలియును? యనునది యొక ప్రశ్న. దానికి సమాధానముగా జ్యోతిశాస్త్ర మను యొక శాస్త్రమును నేర్చినవారికి వివరములు తెలియును. జ్యోతులనగా వెలుగు. ఆ వెల్గు లెక్కడుండు ననగా మనకు మీద నున్న ఆకాశములో మినుకు మినుకు మనుచుగాని కాంతులు జిమ్ముచుగాని గన్పించుచుండును. రాత్రివేళ నక్షత్రములు గ్రహములు కన్పించుచుండును. అవి యెప్పుడూ కదలుచుండును. ఆ నక్షత్రము

లతోపాటు రాశులుండును. ఆ రాశులు యీ నక్షత్రములు గ్రహములు ఇవి యన్నియు జ్యోతిర్మండలములని చెప్పుచు పిలుతురు.

ఈ జ్యోతులనుబట్టి కాలమును నిర్ణయించి యున్నారు. వాటి చలనములతో కాల విభాగము మనకు తెలియపరచబడినది. ఆ కాల విభాగము యెట్లు యేర్పడినదో తెలియవలయును. దానిని మనమిట్లు గ్రహించవలయును.

మనకు కాల విభాగములకు నాధారము ముఖ్యముగా సూర్యు డనబడు మహాగ్రహము తేజోవంతమయినది. గగనముమీద ప్రత్యక్ష మగుచున్నది. ఆ సూర్యుని గమనముతో కాలస్వరూపము నిర్ణయింపబడినది. సూర్యోదయాది సూర్యాస్తమయము వరకున్న కాలము పగటికాలము మనియు, సూర్యుడు కనుపించని కాలము రాత్రి కాలమనియు రెండును కలిపిన యొక దినమగుచున్నదని చెప్పబడుచున్నది. ఇది కాలము యొక్క విభాగము. అటువంటి దినములు యేడు వారమగును. తరువాత పక్షములు, మాసములు, ఋతువులు, ఆయనములు, సంవత్సరములు జరుగుచున్నవి. ఇవి కాల ప్రమాణంగా నిర్ణయింపబడినది. ఈ కాలము నిట్లుండగా యిందులో విభాగములకు గ్రహములు నక్షత్రములు తోడుపడుచున్నవి. వాటి వివరము రాశుల ననుసరించి చెప్పబడుచున్నది.

ద్వాదశ రాసులు, మేషాదిగాను, అశ్విని మొదలు రేవతీ చివరవరకు నక్షత్రములు, గ్రహములలో ముఖ్యమయినవి తొమ్మిదిన్నీ యీ కాల విధానము నిర్ణయించుకొనుటకు వీలుగా నమర్చబడి యున్నది. అట్లు సంవత్సరములైన తరువాత నరువది ప్రమాణముతో మరల తిరుగుచుండును. ఇప్పుడు సూర్యగమనముతో తొమ్మిది గ్రహములు నడుచుచుండును. యీ గ్రహముల సంచారము మేషాది పండ్రెండు రాశులతో సాగుచుండును.

అట్లు రాశినుండి రాశికి సూర్యుడు నెలకొకసారి మారుచుండును. సూర్యుడు రాశి చలనము మాసము కాలము పట్టును.

చంద్రుడు సూర్యుని చుట్టు యొకసారి తిరుగుట కొక రోజగును. పండ్రెండు రాశులలో పండ్రెండు నెలలు తిరుగుటకు సంవత్సరమగును. ఆరు మాసములకు నయనమగును. అవి యుత్తరాయణము, దక్షిణాయనము యనబడుచున్నవి. అయనమునకు మూడు ఋతువులు వచ్చును.

ఋతువునకు రెండు మాసములుగద! ప్రారంభము మేషాదిగా చైత్రం మొదలు మాసములు చెప్పబడుచున్నవి. చైత్ర వైశాఖములు వసంత ఋతువు. జేష్ఠ్యాషాఢములు గ్రీష్మ ఋతువు. శ్రావణ, భాద్రపదములు వర్ష ఋతువు. ఆశ్వీయుజ, కార్తీకములు శరదృతువు. మార్గశిర, పుష్య మాసములు హేమంత ఋతువు మాఘ, పాల్గుణములు శిశిర ఋతువుగా చెప్పబడినది. యీ ఋతువులుకూడా మాసక్రమమున వచ్చును. ప్రతి దినము చంద్రుడు నక్షత్రములలో తిరుగును. పంచాగములో నక్షత్రము నెరిగిన యానాటి నక్షత్రములో చంద్రుడున్నాడని తెలియవలయును. నక్షత్ర ములబట్టి రాశులు నిర్ణయించెదరు. ఆ రాశులలో నక్షత్రము లిట్లుండును. మేషరాశి అశ్వినీ, భరణి, కృత్తిక మొదటి పాదముతో సరిపడును. కృత్తిక మూడు పాదములు రోహిణి, మృగశిర రెండుపాదములు జరిగిన వృషభము నడచును.

మృగశిర చివర రెండు పాదములు ఆర్ధ్రి, పునర్వసు మూడు పాద ములు కలిసిన మిథునరాశి యగును. పునర్వసు నాల్గవపాదము. పుష్యమి, ఆశ్లేష నాలుగు పాదములు కర్కాటకమగును. మఘ, పుబ్బ, ఉత్తర మొదటి

పాదముతో సింహమగును. ఉత్తర మూడు పాదములు హస్త, చిత్త రెండు పాదములు కన్య యగును. చిత్త రెండు పాదము. స్వాతి, విశాఖ మూడు పాదములు తులరాశి యగును. విశాఖ నాల్గవ పాదము అనూరాధ. జ్యేష్ఠ, నాల్గు పాదములు. వృశ్చిక మగును. మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పాద ముతో ధనుస్సు యగును. ఉత్తరాషాఢ మూడు పాదములు శ్రవణము, ధనిష్ఠ రెండు పాదములతో మకరరాశి యగును. ధనిష్ఠా రెండుపాదములు శతభిషం, పూర్వాభాద్ర మూడు పాదములతో కుంభరాశియగును.

పూర్వాభాద్ర నాలుగవ పాదము ఉత్తరాభాద్ర, రేవతి నాలుగు పాద ములు కలసి మీనరాశి యగును. ఇట్లు రాశులు, నక్షత్రములు, గ్రహములు నిర్ణ యించి కాలస్వరూపమును తేల్చిరి. మొత్తము కాలమంతయు పరమేశ్వరుని రూపముగా పెద్దలు చెప్పుదురు.

## నవగ్రహములు - వాటి బలము

ఇదివరలో చెప్పబడిన రాశులతో సంచారములు చేయు గ్రహముల బలముతో జీవులకు జన్మ, యోగము, అపయోగము, రోగము, ధనము, కలహ ములు, స్నేహములు, వివాహములు, సంతానములు, భూ, ధన, కనకమాది యోగములు వాటి వాటి కాలములో నాయా రాశులలో ప్రవేశించినది మొదలు జీవుల శరీరములమీద ప్రతిఫలించుచుండును. అయితే అందరకూ నొకే రీతిగా ప్రతిఫలించునా? యన్న ప్రశ్న రావచ్చును. దానికి సమాధానము యిట్లు చెప్ప

వలెను. జీవి జన్మించిన సమయములో యేరాశిలో యే గ్రహము యెన్నవ భాగాలలో నున్నదో తెలుసుకొనవలయును. ఆ భాగాల ననుసరించి యా నాటి నక్షత్రమునుబట్టియే గ్రహము దశ యెప్పటినుండి ప్రారంభమో ఎప్పటివరకుండునో యా లెక్కల ననుసరించి యాగ్రహము యున్నకాల మా గ్రహదశయని చెప్పుదురు.

తొమ్మిది గ్రహములకు నొక్కొక్క గ్రహమునకు యిన్ని సంవత్సరములు కాలమని చెప్పబడినది. తొమ్మిది గ్రహములకు వెరసి కాలము యిట్లుండును. రవికి ఆరు, చంద్రునకు పది, కుజున కేడు, రాహువునకు పదునెన్మిది, గురునకు పదహారు. శనికి పందొమ్మిది, బుధునకు పదిహేడు, కేతువున కేడు, శుక్రున కిరువది సంవత్సరము ప్రమాణమని నిర్ణయించిరి. ఆ కాలములో పుట్టుక పూర్వ మెంత దశాకాలము జరిగినది? ఇంక యెంత కాలము పుట్టిన తరువాత యుండునో ఎరిగి యా దశ సంబంధ ఫలితములు చెప్పుదురు. ఆ దశాకాలముకూడ విభాగములుగానే యుండును.

దశాకాలము, అంతర్ధశాకాలము, విదశాకాలము, సూక్ష్మదశాకాలము, ప్రాణ దశాకాలముగా విభాగించబడినది. వాటి ననుసరించి యా విభాగములలో యే దశలో యే యంతర్దశయో గుర్తించి ఫలితములు యితర గ్రహముల ననుసరించి చెప్పుదురు. ఇది యంతయు జ్యోతి శాస్త్ర మందురు.

ఈ తొమ్మిది గ్రహములు, పంద్రెండు రాశులు, ఇరువదేడు నక్షత్రములు. దినములు యివి యన్నియు దేవ దేవుని దివ్య తేజో స్వరూపములు ఇట్లు నవగ్రహముల బలము ననుసరించి జీవుల యోగా యోగములు నిర్ణయింపబడినవి. అవియే పరమేశ్వరుని స్వరూపము. అందుచే యీ నవగ్రహములు నొక్కటిని

గాని తొమ్మండు గురునుగాని యారాధించిన వారికి యీశ్వరతేజము నారాధించిన ఫలితము చెందగలదని చెప్పుదురు. పెద్దలవలన తొమ్మిది గ్రహములలో నా సమయము నందున్నదే గ్రహమో ఎట్టి బలమున్నదో యే బలము తగ్గినదో యా బలముతగ్గి శరీరము మీద బాధలు, తగవులు, రోగములు, వివాదములు, దెబ్బలు తగులుట, జీవులు దూరముగా విరోధంతో విడిపోవుట మొదలగు వాటిని గ్రహించి చూడవలయును.

ఈ గ్రహముల విషయముగా చూచుటకు పంచాంగము ననుసరించి జనన కాలము గుర్తించి దానినిబట్టి చక్రము వేసి యా గ్రహములున్న స్థానములు వాటితో సంబంధం వున్న గ్రహములు, యా దశాగ్రహముండు కాలము వాటి దోషములు యివిఎల్ల గ్రహించి వాటికి తగిన శాంతి, జపము, దానం, ధర్మం, భూత తృప్తిగావించవలెను. ఇటువంటి విషయాలలో యీ నవగ్రహాలలో ఎవరెవరు ఎవరి కుపకారాలు చేసిరో, ఎవ రే సమయంలో నెవరి నారాధించి యే ఫలితాలు పొందిరో వాటి విషయాలతో "నవగ్రహాలు-వాటి పూజాబలము" మన మెరుగ వలసి యున్నది.

ఏ గ్రహం యేమి చేయగలదో, యా గ్రహం ఉన్న స్థానం చెడ్డదైన యెట్లు మంచి యా గ్రహములవలన పొందనగునో యవి యన్నియు తెలిసికొని దోషములు తగ్గించుకొని జీవితములు సుఖప్రదములుగా గావించుకొందురు.

నవగ్రహములు ప్రభావం నిజంగా నీశ్వర ప్రభావ మగునని తెలియ వలయును ప్రపంచ మందలి జీవుల జన్మసమయము ననుసరించి లగ్నము నిర్ణయించి యాసమయంలోనే గ్రహము లెక్కడ నున్నవో వాటికి కల సంబంధం

లెట్లున్నవో యేదశయందు యేబలముగాని, బలహీనం గాని యున్నదో పరిశీలించ వలయును. దానిని బట్టి దశలు కట్టవలెను. ఆదశలలో యేగ్రహముయెట్టి విధంగా నుపయోగించునో తెలిసి కొనవలయును. ఏ సమయమునందు యేగ్రహము బాగు చేయకున్న యెట్లా గ్రహములను బాగు చేయునట్లు చేయవలయునో వాటి పూజా విధానములు గ్రహించవలయును. వాటిని శాస్త్రీయంగా పూజించినచో వాటి దోషములు తగ్గి శుభములు చేకూర్చును. నవగ్రహములు యీశ్వర తేజముతో సంబంధిచినదే గదా!

జ్యోతిర్మండల మనదగు నక్షత్ర, గ్రహ, రాశులు సమస్తం తేజస్సుతో గగనములో ప్రకాశించుచున్నవి. ఇవి యన్నియు, సప్తమ ఋషి మండలము చుట్టుతిరుగుచు ధ్రువ నక్షత్ర ముత్తరదిశలో నున్న దానికి ప్రదక్షిణము గావించుచుండును. ఈ రాశులకు ప్రత్యేకమగు నాకారములున్నవి. ఆయాకారము లాకాశములోనున్న సమయములో గ్రహించి చూడవలెను. నక్షత్రముల ప్రోగులు యొక స్వరూపముగా నున్న యా సంకేతముల ననుసరించి పండితులు గ్రహింతురు. దానిని బట్టి ప్రొద్దుకట్టుటకు రాత్రులందు శిరోగత నక్షత్రము ననుసరించి యింత ప్రొద్దు జరిగినది. ఇన్ని ఘడియల రాత్రియైనదని సమయము చెప్పగలరు.

ఇట్లు కాలమును విభాగములుగా చేసి దానిని బట్టి జీవయాత్రకాలం, దశలు, యోగాత యోగంలు లాభములు మారకములు ఇవియన్నియు గ్రహింతురు మనము యేగ్రహము యెట్టి గుణము గలదో యేమి చేయగలదో, యెవరు యెట్లు పూజించి యేఫలితములు పొందిరో తెలుసుకొందము.

## న వ గ్ర హ ము లు

## ప్రధాన గ్రహము సూర్యగ్రహము

గ్రహములన్నిటికి రాజు సూర్యుడు. ఈ సూర్యుడు సింహ లగ్నమున కధిపతిగా నిర్ణయించిరి. సూర్యబలము పెద్దలు నిర్ణయించినట్లుగా పరాక్రమము రాజకీయ సంబంధమగు కార్యములు చక్కబెట్టుట, మంత్రాంగము నడుపుట సంఘ నాయకత్వము వహించుట, పనులు చురుకుగా చేయించుట, పౌరుషము యివి యన్నియు గల్గించు శక్తివంతుడు. యిదిగాక శాస్త్ర జ్ఞానము, తర్క విషయములు సమగ్రీస్తము గల్పించువాడగును. అదియట్లుండ సూర్యుడు దశాకాలములో మంచిగా నుండకున్న రాజకీయమగు చిక్కులు, కలహములు, శత్రుబాధలు, ఋణబాధలు, యన్నియు వ్యతిరేకములుగా నుండి ప్రమాదములు గల్పించును. సర్వదేహులకు సూర్యబలము ప్రధానమే సూర్యుడు సర్వకార్యములు తీర్చువాడు. సూర్యుని గ్రహముగా గాకుండా యీశ్వరరూపముతో తేజోమూర్తిగా ప్రత్యక్షము గన్పించు తేజో మండలము.

సూర్యునిలో శ్రీహరి దివ్య కళ ప్రకాశించుచున్నది. లోకమునకంతయు నేత్రమువంటివాడు. సూర్యుడు సమస్త జీవులకు ప్రాణాధారము. సూర్యరశ్మిచే నౌషధులు పెరుగును. మేఘములు గల్గును. సూర్యకిరణముల వేడిచే నీరావిరి రూపముగా మారి మేఘములుగా మారి చల్లని చోట్లలో వర్షించును. సూర్యగ్రహమును దేవునివలే నారాధించువారు పెక్కుమంది పెక్కు రాజ్యములలోనున్నారు. సూర్యోపాసనముతో దరిద్రముపోవును. కుష్టు మొదలగు శరీర రోగములు తగ్గును. బలము దీర్ఘాయుర్దాయమువచ్చును.

సూర్యమండలములో వేద పురుషుడున్నాడని యువాలఖిల్యాది మహా మునులు వేదము పఠించుచు సూర్యరథము ముందు సాగుచుందురనియు, దైవము ప్రత్యక్షముగా చూడదలచిన సూర్యుని మించిన తేజము లేదందురు.

## సూర్యగ్రహ పూజా ఫలము

సూర్యగ్రహము నారాధించినవారు యిహపర సుఖములందెదరని పురాణ ప్రసిద్ధము. భాగవతములో పాండవులరణ్య వాసమునకుపోయిరని చెప్పబడినది ఆ విషయము యిట్లు వర్ణింపబడినది? పాండవులు, కౌరవులు దాయాదులు అనగా అన్నదమ్ముల బిడ్డలు. పాండవులను చూచి కౌరవులు సహించలేకపోయిరి పాండవులు దేవతాంశలతో జన్మించిరి. యముడు, వాయువు, యింద్రుడు, అశ్వినీ దేవతలు వీరి యుత్పత్తికి యధిదేవతలు వారు బలవంతులై యుండగా వారిని సంహరించ వలయునని కౌరవులు నిత్యమాలోచించుచుండువారు. పాండవులకు విషము పెట్టించిరి. నీటిలో ద్రోయించిరి. నానా విధములగురీతుల సంహరింపదలచిరి గాని ప్రయోజనములేకపోయినది. పాండవులను తరిమివేయవలెనని కౌరవులు నానా విధములగు యత్నములు గావించుచుండిరి.

యిది యిట్లుండగా మయుడను శిల్పి యొక సభాభవనము మాయామందిరముగా నిర్మించి ధర్మరాజునకు బహుమతిగా నిచ్చెను. ధర్మరాజును రాజసూయయాగము గావించ నారదుడు ప్రోత్సహించెను. తన తమ్ములను నలుదిశలు పంపి రాజులచే కప్పములుగొని యాగము ప్రారంభించెను. ఆ యాగమునకు కౌరవులను కూడ పిలిచెను. దుర్యోధనుడు తన తమ్ముళ్ళతో కర్ణ, శకునలతో పరివారముతో బయలుదేరి వచ్చెను. మయసభ చూచుటకు

బయలుదేరెను. మాయ శిల్ప విశారదుడు మయుడు శత్రువులకు పరాభవము జరుగునట్లు వారు శత్రువులని గ్రహించునట్లు నీరున్న చోటలేనట్లు లేనిచోట యున్నట్లు ద్వారములేనిచోట ద్వారమున్నట్లు ద్వారమున్న చోట లేనట్లు గన్పించును.

దుర్యోధనుడు నీరులేనిచోట నీరువున్నట్లు భావించి బట్టమెగ గట్టుకొని నడిచెను. ద్వార బంధమున్నచోట లేనట్లుపోయి తనకుదెబ్బతగుల సిగ్గుపడి యుండగా పైనున్న ద్రౌపది చెలికత్తెలుతో చూచి నవ్వెను. అది చూచి పరాభవమునకు ప్రతి పరాభవము చేయకక్షగట్టియుండెను.

రాజసూయమైన తరువాత యజ్ఞములో ముందు తాంబూలముయెవరికిమ్మని యందువో చెప్పమని భీష్ముని శిశుపాలుడడిగెను. భీష్ముడు విని జగధీశుడు శ్రీహరి, సర్వసమర్ధుడగు నారాయణాంశము వారు శ్రీకృష్ణదేవుడే తగినవాడని నిర్ణయించి చెప్పెను. ఆతడట్లు చెప్పుటవిని చేది దేశపురాజు శిశుపాలుడు నానా విధములగు దుర్భాషలతో సభలో శ్రీకృష్ణుని నిందించసాగెను. శిశుపాలుని తల్లి శ్రీకృష్ణునకు మేనత్త. ఆమె వాని చిన్నతనములో కోరినట్లు నూరుతప్పులు సహించుమన యట్లేనూరుతప్పులు సహించెను. నూరు దాటిన తరువాత యిదిగో యీ తాంబూలము నీవేపుచ్చుకొనుమని తమలపాకు విసిరెను. అది సుదర్శన చక్రమై శిశుపాలుని శిరస్సుఖండించగా వాని శరీరము నుండి వెల్గువచ్చి సభలోని వారందరు చూచుచుండగా శ్రీకృష్ణపరమాత్మ దేహములో కలిసిపోయెను. శిశుపాలుడు తన స్నేహితుడు గనుక నాతని సంహరించిన తన వైరులకుహితుడు శ్రీకృష్ణునిగాదలచెను.

నేను వీరిని రాజ్యభ్రష్టులను చేసి రాజ్యమంతయునేనేయేలె దనని, దుర్యోధనుడులోన తలచుకొని తన్నుపరాభవించిన ద్రౌపదినీ సభలో పరాభ

వింపదలచెను దానికి తగిన మార్గము నాలోచించుచుండెను దుష్టచతుష్టయముగా పేరండిన దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులతో నాలోచించసాగెను. వారిలో మాయాజూదమాడుటలో ప్రవీణుడు దుర్యోధనుని మేనమామ శకుని మంచిసలహా దుర్యోధనునకు యిష్టము వచ్చినట్లు చెప్పెను. ఆ సలహాలో ముఖ్యవిషయము ధర్మరాజు రాజ్యముమోసముతో లాగుకొనుటయైయున్నది.

శకుని యాతని యుద్దేశము గ్రహించి ధర్మరాజు జూదమాడుట యందు యిష్టము గలవాడుగా నెరిగినవాడగుటచే శకుని ధర్మరాజును జూదమునకు పిలువ మని ప్రోత్సహించెను. ధర్మరాజునకు జూదమాడ కబురు దుర్యోధనుడు చేసెను న్యాయముగు జూదమాడిన సంతసమునుకొని ధర్మరాజు సమ్మతించెను

గతములో కౌరవ వంశమును నాశనముగావించుకోర్కెను. తీర్చుమన్న తండ్రిమాటదలచుకొని శకుని దుర్యోధనుని ప్రోత్సహించెను. దుర్యోధనుడు తన మేనమామను ద్యూతములో జయమువచ్చునట్లు చేయమని ప్రార్థించెను. దాని కాతడు సమ్మతించెను. ధర్మరాజు జూద గృహములో ప్రవేశించెను. ఎదుట పక్షము వారు దుర్యోధనాదులు వానికెదురుగా గూర్చుండిరి. జూదమాడుటకు శకుని ముందునకు వచ్చి కూర్చుండెను. పందెము ప్రారంభమైనది. తాను పందెము నెగ్గుదునను కొన్న ధర్మరాజు క్రమముగా పాచికల మాయతో నోడిపో సాగెను. ఎన్ని పందెములు వేసినను తానొక్క పందెము నిర్ణయించలేదు. దీర్ఘ ముగా నాలోచించెను. చివర పందెము రాజ్య మొడ్డెను అదియు పోయెను. ధర్మ రాజేమిచేయును? తనమాట నిలబెట్టుకొనునుగాని మాట తప్పడుగదా!

రాజ్యము వదిలి కట్టుబట్టలతో పోవ యత్నించుచుండెను. యిది విదు రుడు విని భీష్మాదులతో ధర్మ విషయముగా నిట్లనెను పందెము వేసినంత మాత్రములో రాజ్యములాగు కొందురా! ఏదియైన పణము పెట్టవచ్చును. ఇతర విధముగా నన్యాయమున రాజ్యములాగు కొందురా? యిది న్యాయము కాదు వారి రాజ్యము వారికిచ్చి గౌరవించుట తగును. అందులో వారు పరాయి వారా? రాజ్యార్హులు జ్ఞాతులు ఎంత దుష్టత్వమందులో నున్నది విచారింపుడన భీష్మాదులు ధృతరాష్ట్రునితో ఈవిషయము చెప్పియిట్లనిరి పాండవుల నగౌర వము పరచుటతప్పు.

వారు మీరు యొక కుదురులోనివారు. జూదము మిషతో యిట్లు మోసగించి ధర్మము తప్పని ధర్మరాజు నడవులకు పంపుట తగదని గట్టిగా చెప్పగా ధృతరాష్ట్రుడు కుమారునిఖిలిచి మందలించి వారి రాజ్యము వారి కిప్పించి దూరముగా వారి నుంచి వేసెను. దుర్యోధనాధులకు బాధతీరలేదు.

## రెండవ జూదము - అరణ్యవాసము

పెద్దవారు పాండవ పక్షపాతముతో నున్నారు వారిరాజ్యము మనము యెట్లయినను సంపాదించి మయసభలో పొందినయగౌరవమునకు ప్రతిగావారికి ద్రౌపదికి పరాభవము చేయుట ముఖ్యమని వారూహించి దుర్బుద్ధితో పన్నా గములు పన్నుచుండిరి. మయసభలో పొందిన దానికిబదులు తీర్చ మరల శకునితో మంతనములు దుర్యోధనుడు మొదలుపెట్టెను. వారిద్దరు యిట్లాలో చించిరి. మనమాలోచించిన మార్గములో పెద్దలు తలదూర్చకుండా ముందుగా జాగ్రత్తపడవలయును ధర్మరాజు మాట తప్పడు. అందులకై నారితో ముం దుగా షరతులు నిర్ణయించుకోవలయును. అవి యేవనగా జూదములో

కూర్చుండుటకు రమ్మనుట యొకటి సొంతమగుదాక లేకుండుటొకటి ఓడిన వస్తువులను తిరుగ గ్రహించకుండుటొకటి.

యివిగాక యెవరు జూదములో నోడుదురో వారు పండ్రెండేండ్లు వనవాసముగావించుట నొకయేడజ్ఞాత వాసము చేయుటయు జరుగవలయును. యిందులో యేది చెడినను మరల మొదటి నుండి వనవాసము. యజ్ఞాతవాసము గావించవలయును. దీనికంగీకరించిన జూదమాడమని షరతులు విధించి తీసి కొని రావలయునని నిశ్చయించుకొనిరి. ధర్మరాజును మరల జూదమునకు రమ్మనిరి. ఆతడు దానియందు యిష్టముచే సమ్మతించెను. వారు యిది వరలో సిద్ధపరచుకొన్న షరతులు వివరించిరి. దాని కాతడు సమ్మతించెను.

జూదము మొదలైనది అది మాయా జూదముగద! ధర్మరాజు పందెములొడ్డి యోడి పోవుచుండెను. రాజ్యము, తమ్ములు, భార్య తాను చివరకు జూదములో నోడిపోయెను ద్రౌపదిని పరాభవింపదలచిరి. వారు కౌరవసభలో నానా విధముల పరాభవములంపిరి. పెద్దలు మారుమాటాడ లేకపోయిరి.

అప్పుడు పాండవులు కట్టుబట్టలతో రాజ్యము వదలి ద్రౌపదీదేవి వెంటరాగానరణ్యములకు ప్రయాణమైపోవుచుండిరి. ధర్మదేవతాంశలో జన్మించిన ధర్మరాజును చూచి దుర్యోధనాదుల మోసము తలచిప్రజలందరు బాధపడ సాగిరి. ధర్మరాజుతో పదివేలమంది బ్రాహ్మణులు హితులు ప్రయాణమై వెంట బడిరి. వారిని చూచి ధర్మరాజిట్లనెను. మహాత్ములారా! రాజ్యమువదలి యరణ్యా వాసమునకు పోవుచున్న నన్ను మీరు వెంబడించిన కష్టజీవితములు గడుపవల యును సుఖముగా నుండు వారు మాతో యీ యాతనలు పడుచు కందమూలా దులు తినుచు తిరుగు ఖర్మ మెందులకు? వెనుకకు మరలుడని బ్రతిమాలెను. వారు విని తిరిగి యిట్లు సమాధానము చెప్పిరి.

ధర్మరాజా! మేము ధర్మమూర్తి నాశ్రయించుకొని జీవింతుము. ఈ యధర్మ రాజ్యములోనుండజాలము. ధర్మహీన ప్రదేశములలో సుఖములనుభవించుట కంటె ధర్మమున్నచోట కందమూలములు తినుచు బ్రతుకుట యుత్తమమని మా యభిప్రాయము. మేము మిమ్ము వదలము. మమ్మా టంక పరుపకుమని వారు సమాధానమిచ్చిరి. ఆతడువారినేమనగల్గును! సరియే యన్నాడు వారందరితో తమ్ములతో, భార్యతో ధర్మరాజు వనవాసమునకు ప్రవేశించెను. అతనిలోని బాధయెవరు గ్రహించగలరు? వీరందరు కడుపార భుజింపక వనవాస కష్టములనుభవించుట సమ్మతముగాలేదు, ఈ మహారణ్యములో నింతమందికి భుక్తిఎట్లు జరుగును? దానికి విధానమున్నదా? యని యోచించుచుండెను.

ధర్మరాజు తమ్ములతో, భార్యతో, మహాజనులతో నరణ్యావాసమునకు వచ్చినాడు. చూచివత్తమని మహామునులాయనను చూచుటకువచ్చుచుండిరి. అట్లువచ్చెడి వారితో తనలోని కోరిక చెప్పగానెవరు తగు సమాధానము చెప్పలేదు. చేయునది లేక యోచించుచుండెను.

ధర్మమూర్తులగు వారు వనవాసములో నున్నారని వచ్చిన మునీంద్రుల ద్వారా ధౌమ్యులవారు పాండవులను దర్శించుటనగా ధర్మదేవతను దర్శించుటగా తలపోయుచుండు సాధువులు గుంపులుగా జేరియున్న సమయములో ధౌమ్య మహాముని వచ్చి ధర్మరాజులను చూచి పెక్కు విధముల పొగడెను. ధర్మరాజు వచ్చిన ధౌమ్య మహామునీంద్రుని గౌరవించి యిట్లనెను మునీంద్రా! మీవంటి వారి దర్శనము పాపములు పోగొట్టును. మిమ్ము వదలబుద్ధి పుట్టదు. తమవంటి వారితో గోష్ఠి మిగుల నుత్సాహము గల్పిం

చును. నా యందనుగ్రహముంచి నాతో మీరుంత గోరెదను. అది విని సంతోషించి యా మునీంద్రుడిట్లనెను.

ధర్మరాజా! నేను ధర్మదేవతను పూజించుటకు ధర్మదేవతతో కాలము జరుపుటకు, ధర్మదేవతకు పురోహితునిగా నుండుటకే వచ్చినాను నేటినుండి నీకు పురోహితుడనదగును. నీకు వలయు విషయములు చెప్పవలెను. నీకున్న సందియములు తీర్చెదను. ధర్మవిషయముల నుపదేశించెనని వాగ్దానము చేసెను. అతడది విని పరమానందమంది! మీరు నా శ్రేయస్సు కోరినవారు. మిమ్ము పూజించుట కన్న నాకేమి కావలయును? మీవంటి ఘనులతో జరుగుతున్న కాలము పవిత్రమైనదగును. నాకులోన గల్గుచున్న ధర్మసందేహములు మీ ముఖతః విని తృప్తిపడెదను. రాజగర్వము నరకమునకు దారి తీయును. మహనీయుల సాంగత్యము యిహపరములు గల్పించును.

మిమ్మారాధించుచుందును. నా జీవితము ధర్మబద్ధముగా నుండునట్లు సలహాల నీయ ప్రార్థింతును రాజ్యమేలుటకన్న మహనీయుల సహవాసముతో ప్రశాంతమగు వనవాసము యెంత సుఖదాయకమైనదో నాకు యిప్పుడిప్పుడే తెలియుచున్నది. నా యదృష్టముగా భావించెదనని యిట్లనెను.

## ధర్మరాజు-సూర్యోపాసనము

మహనీయా! ధౌమ్య మునీంద్రా! నేను దాయాదులతో జూదమునందు రాజ్యము సమస్తము, సోదర, భార్యాదులతో నోడిపోయినాను. వారికిచ్చిన వాగ్దానము ప్రకారము నేను యీ యరణ్యవాసమునకు వచ్చినాను. మీ

వంటి మహామునీంద్రుల సేవలలో మునుగుచు సంతోషించుచున్నాను. నేను వలదన్నను నాతో పదివేలమంది బ్రాహ్మణ్యము వెంటబడినది. వారిని వలదని యెంతయో బ్రతిమాలి చెప్పినను వినక యీ యరణ్యములలో కంద ఫలాదులతో పొట్ట నింపుకొనుచున్నారు. వారికి కడుపునిండా భోజనము దిక్కుటలేదు. నేను కట్టుబట్టలతో వచ్చినానుగాని ధనద్రవ్యములు నా వెంటగొని రాలేదు. వారికి భోజన సదుపాయము గురించి చాలా విచారించుచున్నాను. బ్రాహ్మణులు యీశ్వరాంశగలవారు. వారిని తృప్తిపరచిన సమస్తము చక్కబడును. నాకు వారిని గురించి పుట్టిన ఈ వేదన యెట్లు తగ్గును? తమరు నా హితము గోరి తగినరీతిగా సలహా చెప్పెదరని విశ్వసించుచున్నానని దీనముగా ప్రార్థించెను.

ధౌమ్యులువారు విని ధర్మరాజా! యీపాటి దానికే యింత విచారమా? నీ విచారము పోగొట్టు మార్గమున్నది. దానిని నీవు దీక్షతో సాగించిన చక్కబడును. నీ వాంఛితములు తీరును. సందేహించవలదు. మనకు మంచి కావలయునన్న, ధర్మమార్గములో నిలువవలెనన్న యిహ పరములలో ముఖ్యమార్గము వేద మార్గము.

వేదము ప్రమాణముగా నంగీకరించువారు దానిని వదలరు. నీ వంటి ధర్మ విధులు నడువ దగినది. దానిని వివరించెదను. వేదపురుషుడు ధర్మమూర్తి. ఆ ధర్మమూర్తియే యాదిత్యుడు. ఆదిత్యునియందు వాలఖిల్యాది మహామునులు వేదగానము చేయుచు నడచుచుందురుగదా! అట్టి మహాబల సంపన్నుడు సూర్యుడు.

సూర్యునివలన సృష్టి నిలబడుచున్నది. సూర్యుని వలననే యోషధులు పెరుగుచున్నవి సూర్యుని వలననే కాలచక్రము తిరుగుచున్నది. సూర్యునిచుట్టు

గ్రహములు తిరుగును. సూర్యుడే జీవులకు జీవనదాత సూర్యుని గగన మండల ములో గ్రహముగా భావించక సకల కార్యములు తీర్చు దేవతామూర్తిగా భావించుము. నీవు నేను చెప్పిన ప్రకారము సూర్యోపాసనము గావించుము. నీ యిష్టకార్యములు తీరగలవు అందుచే నీవు వేద మంత్రములలో నున్న సారమును, యితరోపాసనా నమస్కారములు విధి తప్పకుండా తీర్చుము. ఆ సూర్యదేవతకు నామములతో నర్ఘ్యములీయ వలయును. అట్లు చేసితివేని యా హిరణ్మయమండలములో నున్న యధిదేవత నీకు ప్రత్యక్షమగును నీ వాంఛిత ములు తీర్చును. అతడన్నదాత. జీవులకు బ్రతుకుటకు మూలాధారము గావున నే చెప్పినట్లు చేయుమని యా సూర్య మంత్రములను ధర్మరాజునకుపదేశించెను.

ఆ ధర్మదేవత ధౌమ్యుని వలన మహామంత్రమును పొందెను. తరువాత తమ యాశ్రమతీరము నందున్న యొకయేటిగడ్డలో స్నానమాచరించెను. నిత్యకృత్యములు తీర్చుకొని సూర్యోపాసనము గావించ సాగెను. ఇట్లా అతడు కొంతకాలము నియమముతో కఠినముగా నుండి సూర్యదేవునారాధించు చుండెను ఇట్లు దీక్షతో నాతడు పూజించి జపించుటలో నెక్కువబలము చేకూరినది.

ఆ బల ప్రభావముతో ధర్మరాజు మీద సూర్యునకు దయగల్గినది. అతనికి ప్రసన్నుడై వాంఛితము తీర్చ నిశ్చయించెను. దీక్షబట్టి యోగము గ్రహించి గురువుగానున్న ధర్మరాజు ననుగ్రహించదలచిన సూర్య భగవానుడు. భక్తుని కోరిక నెరవేర్చుటలో సందేహించలేదు. అతడు ధర్మమూర్తి, వాని ధర్మమున కానందమంది సూర్యనారాయణుడు, తన తేజము తగ్గించుకొని యాతడు దర్శించ దగినరీతిగా రూపము ధరించెను.

ధర్మరాజు చూచుచుండగా సూర్యమండలము నుండి శంఖచక్రములతో పీతాంబరములతో, వనమాలికలతో, నూతనాలంకారములతో మెరపుమెరసినట్లు దిగివచ్చి ధర్మరాజు ముందు నిలచెను ధర్మరాజు దివ్యకాంతులతో నున్న దివ్య పురుషునకు సాష్టాంగపడినుతులొనరించెను. ఆతడు సంతోషించి "ధర్మరాజా! నేను సూర్యమండలాధిష్టాన దేవతను. నన్ను భక్తితో నీ వారాధించిన క్రమమున కానందపడితిని. నీవే కోరికతో నన్నుపాసించి నావో చెప్పుము నీ కోర్కె తీర్చు దననెను ఆ మాటలు విని సంతోషముపట్టలేక నానంద బాష్పము లాయన పాదములపై బడునట్లు శిరస్సువంచి ప్రణామము చేసియిట్లనెను. దేవా! నేను దాయాదులతో జూదమాడి రాజ్యము పోగొట్టుకొన్నాను. నాతో నాతమ్ములు భార్య వచ్చినారు. వారట్లు వచ్చుటయేకాక పదివేలమంది బ్రాహ్మణ్యము, ధర్మ దేవతవు నిన్ను వదలమని కందమూలా దులు తినుచు నానా కష్టములు పడు చున్నారు. వారికి శ్రమలేకుండా భోజనాది సదుపాయములు చేయ నిన్నారాధించి నాను. నీవు నా యందు దయయుంచి తగు సదుపాయము చూపుమని వేడు కొన్నాడు.

సూర్యుడు ప్రసన్నుడై తన చేతిలోనికి సువర్ణపాత్రను తెప్పించి పట్టు కొని యిట్లనెను. ధర్మరాజా! యీ పాత్రను నీకిచ్చుచున్నాను. యిది యుదయ మంది యెన్ని వేలమందికైన వండి పెట్ట పనిలేకుండా భోజనములందించును, ప్రతిదినము భోజనానంతరము కడిగి యొకచోట వ్రేలాడదీయుము. కడిగిన తరువాత మరల నా రోజులో భోజనమందీయదు. యిది తెలిసికొని జాగ్రత్తగా వాడుకొనుమని యిచ్చి మాయమయ్యెను. దానిని పట్టుకొనిపోయి ప్రతిదినము శ్రమ పని లేకుండా భోజనాదులందించుచుండెను.

ఇది సూర్యగ్రహము నారాధించిన వారికి కల్గు ఫలితముగా తెలియ దగును. సూర్యుడు జాతకము బలీయుడుగా లేనప్పుడు సూర్యోపాసనతో సమస్తము చక్కబడి యోగించును.

యిది నవగ్రహములలో సూర్యగ్రహ పూజామహిమ.

నవగ్రహ పూజా మహిమ

## 2. చంద్రగ్రహము

యిదివరలో వివరించినట్లు కాలమును తెలియుటకుపయుక్తమగు నవగ్రహములలో చంద్రుడు రెండవవాడు. చంద్రుడు కర్కాటకరాశికధిపతి ఆతడు మంచి స్థానములలో నున్న యోగము చేయును. అనగా తనలగ్నము నుండి రెండవ యింటి యందు నాల్గవ యింటి యందు, అయిదవ యింటి యందు యేడవ యింటియందు, తొమ్మిదవ యింటి యందు, పదియవ యింటి యందు, పదకొండువ యింటి యందున్న మేలు చేయును. ఈతడు శుభ గ్రహము. ఈతనితో మంచి గ్రహములు కలసినను యీతనినవి చూచినను వాటిని మంచి చోటు నుండి యీతడు చూచినను జాతకమునకు మేలు చేయును. ఆతడున్న స్థానములనుసరించి బలము చూపును. చంద్రుని వలన తల్లిబలము, గృహబలము, విద్యాబలము, కళత్రబలము, భాగ్యబలము, కర్మస్థానబలము లాభములు గల్గును.

ఈతడు వ్యతిరేకముగానున్నచో జాతకమునకు బాధలు గల్గును. ఎవరు చంద్రుడున్నస్థానమున కనుకూలముగానుందురో, యా చంద్రుని కను కూలగ్రహములు చూచునో వారికి సర్వసుఖములు లభించును. ఆ చంద్ర

గ్రహమనుకూలముగాలేని వారలకు పెక్కు విధములగు పాట్లు జీవితములో పడుచుందురు. చంద్రగ్రహములో నధిష్ఠానదేవత యుండును. ఆ దేవతనారాధించిన వారికి సకల శుభములు గల్గును. ప్రతి గ్రహమునకు వారి వారి దేవతలను పూజించిన కష్టములు తొలగి సుఖములు వచ్చును.

చంద్రగ్రహమండలములో నధిష్ఠానదేవత గౌరీదేవి. చంద్రుడనుకూలముగాలేని సమయము చంద్రుని పూజించవలయును. చంద్రుని పూజించుటన్న చంద్రయాంత్రమును శాస్త్రీయముగానుంచిప్రతిదిన మర్చించి చంద్ర మంత్రము జపింపవలయును.

## చంద్రగ్రహ పూజామహిమ

పూర్వము సుకేతుడను రాజు గలడు ఆయనకు సుమతియను భార్య గలదు. వారిద్దరన్యోన్యముగా సంచరించుచు చిరకాలము కాపురము చేసిరి. వారి రాజ్యమంతయు సుభిక్షముగా నుండెను. ఎందరెందరో వారి యన్యోన్యమునకు సుకేతుని రాజ్యపాలనమున కానందపడుచుండిరి. అతడు దైవపూజలు. దాన ధర్మములు, త్యాగములు చేయుచు ప్రజల నందరను కన్నబిడ్డలవలె చూచు చుండెను. సుకేతుని రాజ్యపాలనములో యే బాధలులేవు. జనులందరు సంతోష ముతో సుఖముగా కాలము జరుపుచుండిరి. వీరికి చిరకాలము వరకు సంతానము గల్గలేదు. చాలాకాలము సంతానములేని బాధతో వారు సతమతమగుచుండిరి. పెద్దలను పిలపించి వారితో సమాలోచనము చేయసాగెను. నాకు సంతానము లేకున్నజీవితము వ్యర్థముగద! అందుకై నాకు సంతానము గల్గుమార్గము శలవిండని ప్రార్థించెను.

రాజు ప్రార్థనమాలకించి వారు సమయమును గుర్తించి లెక్కలు గట్టినారు. ఆ రాజునకు జాతకములో లోపములు గ్రహించినారు ఆ రాజును చూచి రాజా! నీకు గ్రహదోషమున్నది. దానిని తీర్చినచో సంతానము గల్గును. ఆ దోషశాంతికి హోమములు చేయువలయును. సంతాన స్థానములో నొక పెద్ద దోషమున్నది. దానిని తగ్గించుకొనుమనివారు ప్రోత్సహించిరి. ఆ రాజు వారి ప్రోత్సాహముతో హోమములు చేయుటకు సర్వప్రయత్నములు చేసిరి.

ఒక శుభముహూర్తమందు పండితులందరు జేరగా రాజు చేత సంకల్పము చేయించి వేదవిహితముగా మంత్రములు చదువుచు హోమములు చేయసాగిరి. అట్లు వారమురోజులు హోమములు సాగించి యరిష్ట స్థానదోష శాంతి గావించిరి వారు చేసిన హోమశాంతితో రాజు భార్య గర్భము ధరించెను.

రాజు తన భార్య గర్భము ధరించిన విషయము విని పరమానందమందెను. ఆమె నవురూపముగా సమస్త సదుపాయములతో గర్భస్థ శిశువును వృద్ధియగునట్లు మంత్రములు, రక్షణలు, ఇతరములగు విధానములతో సురక్షితముగానుండెను. నవమాసములు నిండిన తరువాత నొకశుభముహూర్తము నందు సుమతి ప్రసవించినది. ఒక చక్కని సుందరదేహముగల కుమార్తెను ప్రసవించి నట్లు రాజునకు తెలియజేసిరి. రాజు యీ శుభవార్తవిని సంతోషముతో మధుర పదార్థములు, దాన, ధర్మములు తన్నాశ్రయించిన వారి కందరకు పంచిపెట్టించెను. వారందరు సంతోముతోనిండి రాజపుత్రిక దీర్ఘాయుర్దాయముతో వర్థిల్లుగాక! యని యనుకొనసాగిరి. ప్రసవ స్నానానంత

రము జాతక కర్మకలాపములు సాగించి మహావైభవము ప్రకటించెను. అందరు పరమానందముగా రాజపుత్రికను చూచిమెచ్చుకొనిరి.

ఆ రాజు తన కుమార్తెకు "సౌభాగ్యవతి" యను నామకరణముంచి పెంచుచుండెను. క్రమముగా నాపై తండ్రి యింటిలో పెరుగుచు నాటలాడుచు వాతికళ్ళకానందముగా సంచరించుచుండెను. ఆ రాకుమారికి రాజు విద్యాబుద్ధులు నేర్పించుట కారంభించెను. చక్కని పెద్దవాడగు గురువుచే విద్యనభ్యసింప జేయుచుండెను, ఇట్లు కొంతకాలము రాకుమారి విద్యలను నేర్చుకొనుచు మంచి పద్ధతులతో మెలగుచుండెను. ఇట్లు కొన్నాళ్ళు జరిగిన పిమ్మట రాజపుత్రికకు వివాహ వయస్సు వచ్చినది. రాజు తన కుమార్తెకు తగిన వరుని చూడవలయునని భావించెను.

ఒకనాడు రాజుసభలో మంత్రులతో తన కుమార్తె వివాహ విషయము వెల్లడించెను. వారందరు విని పరమానందభరితులైరి. తరువాత కొందరు సమయజ్ఞులగు బుద్ధిమంతులను రాజసభకు పిలిపించిరి. వారిని పిలిపించి రాజుసమ్మతితో ముఖ్యమంత్రి యిట్లు వారితో చెప్పనారంభించెను.

ఓ విద్వాంసులారా! మీరు మహనీయులు. మీరు త్రికాలవేదులు సమస్తము యెరిగినవారు మనరాజకుమార్తెకు వివాహము చేయదలచి రాజుగారు మిమ్ము పిలువనంపినారు. మీరు నానా దేశములు తిరిగి మనరాజకుమార్తెకు తగిన వరుని వెదకి చూచిరండు. మీకందరకు బహుమానములు విశేషముగా ముట్టగలవన్నాడు. వారు మంత్రివర్యుని మాటలననుసరించి ప్రయాణమైనారు. మిగులనుత్సాహముతో బయలుదేరి యెన్నో రాజ్యములు తిరిగి తిరిగి వేసారినారు. రాజకుమార్తెకు తగిన వరుడు యెక్కడ దొరకునా యని యోచించి విదర్భదేశపు రాజకుమారుడున్నాడని వారికి కొందరి వలన

తెలియవచ్చినది. వారు వెంటనే బయలుదేరి విదర్భకుపోయి యా రాజ దర్శ నము గావించిరి. రాజువారి కుచితమర్యాదలు గావించి కూర్చుండజేసి యిట్లనెను. మహనీయులగు మీవంటి వారి రాక శుభావహముగద!

మీరు దయచేయుటచే నారాజ్యము పావనమైనది మీవంటి పుణ్యాత్ములు త్రొక్కిన ప్రదేశము సమస్త శుభములకు స్థావరమగును. తమరు విచ్చేసిన కార్యము గురించి వినగోరెదను. మీకు యిష్టమగురీతిగా వర్తించెద ననెను. అది విని వారలు రాజుతో నిట్లనిరి. మహారాజా! మా సుకేతు మహారాజు గొప్పతనము మీరెరుగనివారుగాదు మీవంశమర్యాదలు మేము గుర్తించిన వారమే, మా మహారాజు కుమార్తె సర్వలక్షణ యుక్తురాలు వివాహ వయస్సు వచ్చియున్న యామెను మీ కుమారునకు వివాహము గావించ వచ్చినారము. మీరు మా మాటలయందు ప్రేమ జూపించి మేముకోరినట్లు రాజకుమార్తెను శుభసమయములో చూచి వివాహము గావించుకొని మీ కోడలిగా చేకొనుడు.

అని వారనగానే రాజు సంతోషించి పెద్దలగు మీరు మా కుటుంబ శ్రేయస్సుకోరి వచ్చిన వారి మాటతీసివేయుదునా? మేము తప్పక వచ్చి యా కుమారిని చూచి నిశ్చయపరచుకొందును. ఈ కుమారుడే వరుడని చూపగా వారానందమందిరి.

## సౌభాగ్యవతి వివాహము

తరువాత వారు శుభదినమును నిశ్చయించి యా రోజునకు రమ్మని మేము సర్వసన్నద్ధము చేతమని చెప్పి వెడలిపోయిరి. ఆ రాజు తనకు నిర్ధేశించిన శుభదినమునకు బంధుమిత్రపరివారముతో పెండ్లి

కుమార్తెను చూడ బయలుదేరెను. వారు వచ్చుచుండుట సుకేతుడు విని యెదురుగా జని తగు మర్యాదలు చేయుచు వారిని సౌధములుగల రాజనగరులో విడిదినొసగిరి. వారందుజేరిన తరువాత తమ నివాసములో యేర్పాట్లు పెండ్లి కుమార్తెను చూపించిరి. వారి పరమానందమంది బహు లక్షణవతి, యీమెను కోడలుగా నంగీకరింతునని యా రాజు తన సమ్మతిని వెల్లడించెను. వారు ప్రధానము గావించుకొనుటకు ముహూర్త నిశ్చయమునకు వలసిన యేర్పాట్లు చేయించమనెను. కార్తాంతికులను బిలిపించి ప్రధాన సమయము తెలిసికొనిరి. ఆ సమయమున నుభయపక్షముల వారువారి యత్నములలో నుండిరి. మహామహుల మధ్య రాకుమారిని కూర్చుండబెట్టిరి.

పురోహితుడు చక్కని బంగారు పీటమీద కూర్చుండజేసి వినాయకుని నర్చింప జేసెను. పిదప మహాలక్ష్మీ పూజ శాస్త్ర విధానముగా చేయించెను. ఆ సమయంలో రాకుమారికి పెట్టదలచిన యాభరణములు సువర్ణ పళ్ళెరములో నుంచిరి, విలువగల చీరలు కంచుక వస్త్రములుంచిరి. ముత్తైయిదవులు పెండ్లివారి పక్షమున నిల్చిరి. రాజబంధువులు రాణితో రాకుమారికి బొట్టుపెట్టి యా పళ్ళెరము నగలు వస్త్రములున్న దానినందించెను. ఆమెనులోనికి గొనిపోయి యా చీర కట్టించి రవిక తొడిగి సర్వాభరణముల నలంకరించిరి.

తరువాత పుణ్యస్త్రీలు వెంటరాగా రాకుమార్తె వచ్చి తన బంగరుపీట మీద కూర్చున్నది. ముత్తయిదువులు బ్రహ్మణాశీర్వచనములైన తరువాత మంగళ హారతి పట్టిరి. అందరు దీవించి యక్షతలువేయగా నామెను లేవదీసి పెద్దవారికి నమస్కారములు చేయింపజేసి లోని గృహమునకు గొనిపోయిరి.

పిమ్మట పెద్దలు రాజువరుల సమక్షమున పంచాంగములు తిరుగవేసి సర్వబలములు గలదియు సంతాన సౌభాగ్యములతో తులతూగగల మంచిలగ్న

మును నిశ్చయించిరి. ఆ లగ్నము నిశ్చయించిన మగపెండ్లివారు వారిరాజ్యము నకు తిరిగిపోయిరి. సుకేతుడు ముందుగా లగ్నపత్రిక నొకబ్రాహ్మణునిచే పంపించెను. ఆ శుభపత్రిక గొనివచ్చిన భూసురునకు సకల మర్యాదలు చేయించి కడుపార భోజనము తినునట్లు తన పురోహితుని యింట యేర్పాటు చేసెను. దివ్యాంబరములు బహుమతిగా గొని యాతడు వెళ్ళిపోయెను. శుభ ముహూర్తము నకు మగ పెండ్లివారు తరలివచ్చిరి. మహావైభవముగా సుకేతుడు రాజపుత్రుడగు శూరసేనునకు చక్కగా కాళ్ళుగడిగి సాలంకృతకన్యాదానము గావించెను. మంచి యేర్పాట్లతో గొప్ప మర్యాదలతో, మంగళవాద్యముల ఘోషతో బ్రాహ్మణుల మంత్రపఠనములతో, ముత్తయిదువులు నీరాజనములుతో వివాహమానందముగా జరిగినది.

కొన్నాళ్ళకు సౌభాగ్యవతిని యత్తవారింటికి కాపురమునకు పంపిరి. ఆమె తన భర్తతో ననుకూలవతియై సంతోషముగా కాలము జరుపుచు కాపురము చేయుచుండెను. ఇట్లు కొంతకాలము చక్కగా కాపురము జరుపుకొనుచుండ సౌభాగ్యవతికి గర్భవతియైన తరువాత పుట్టినింటి వారు ప్రసవమునకు గొనిపోయిరి. ఒక శుభ సమయంలో సౌభాగ్యవతి చక్కని కుమారుని ప్రసవించినది. ఆ కుమారుడు బాలచంద్రునివలె ప్రకాశించుచుండెను. అందరానందించుచుండిరి. అల్లారుముద్దుగా పిల్లవాడు పెరుగుచుండెను.

ఆ పిల్లవాడు పుట్టిన తరువాత యైదు సంవత్సరములు గడచినవి. ఆ సమయంలో బాలునకు చంద్రదశ ప్రారంభించినది. ఆ చంద్రుడు దుష్టగ్రహముల వీక్షణలో నుండి పాప స్థానములో నుండిన కారణముచే యందోషము కుటుంబము మీద పడినది. తండ్రికి యాదశా ప్రారంభము నుండి వ్యాధి యంకురించినది.

చంద్రుని బలహీనతచే వ్యాధి ముదురసాగెను. ఎందరో వైద్యశిఖామణులు వైద్యములు చేసిరి. కాలమనుకూలముగాలేనందున మందులు పట్టియలేదు. క్రమక్రమముగా రాజు నీరసించిపోవుచుండెను. ఇట్లు సౌభాగ్యవతి చరిత్రము నవగ్రహముల పూజాఫలము వివరించుచు నరణ్యములో ధర్మరాజునకు మునులు వివరించసాగిరి. ధర్మరాజు మునులు చెప్పుచున్న గ్రహములు వాటి గుణములు దోషములు వినుచుయిది వరలో సూర్యునారాధించిన బలము తాను స్వయముగా పొందుటచే మిగిలిన గ్రహములవిషయములడుగుచుండగా చంద్రునిగురించి ఇంకొక మునీంద్రుడు ఈ సౌభాగ్యవతి చరిత్రము చెప్పసాగెను. ఆయన వలన యీ కథ విని తరువాత చంద్రదోషము పోవుటకు మార్గమేమి? వారా బాధనుండి యెట్లు తప్పించుకొన్నారు చెప్పవలసినదని కోరెను. చంద్రదోషము పోగొట్టు కొనుటకు వారేమిచేసినారు? ఆ విషయము చెప్పగోరెదనన్నాడు.

ఆ మాటవిని మునీంద్రుడు యిట్లనెను ధర్మరాజా! వారికి చంద్రదశ బాలునకు వచ్చుటచే బాల్యమున వచ్చు పుత్రులదశాయోగములపయోగములు తండ్రికి చెందును. శూరసేనుని పీడింప సాగినది. ఎన్ని వైద్యములు చేయించినను కుదురలేదు. మంత్ర శాస్త్రవేత్తలను రాజు సంప్రదించెను. వారు చంద్రదోషము తగ్గుటకు పూజలు జపములు, దాన ధర్మములు చేయవలయునని సలహా చెప్పిరి అది విని యే దేవతా జపము చేయవలయును దానికి మార్గము చెప్పుడని వారిని కోరెను. వారు చంద్రదోషము తగ్గుటకు గౌరీ రూపమున మంత్రము నారాధనము మహాశక్తికి చేయవలయును యనిరి.

రాజు యే విధముగా చేయవలయునన్న యే గ్రహమునకైన నలుబది రోజులు పూజాదులు గావించవలెను. గ్రంథములలో రోగమున కౌషధములు వాడుటయేగాక ముఖ్య దేవతారాధనము గావించిన యా గ్రహశాంతి యగుననిరి.

అది విని ధర్మరాజు గౌరి విషయము యీచంద్రుని దోషము పోవుటలో నెట్లు తోడ్పడునో నాకు చెప్పుడని కోరెను. దానికాముని పుంగవుడు విని నేను చెప్పుచున్నాను వినుము. మనము చూచు గ్రహములు మండలములు. అందు తేజములలో నొక్కొక్క దేవతా సంబంధముండును. ఈ చంద్రగ్రహములో గౌరి తేజమున్నది. గౌరి తేజముండుటచే గౌరి దేవతారాధనముతో యాగ్రహదోషము నివారణమగునని యిట్లనెను. ఈ గ్రహము లీశ్వరకల్పితములు ఈశ్వరు డొక్కొక్క గ్రహమునందొక్కొక్క దేవతా తేజముంచి సృజించినాడు. వాటి యందున్న తేజమును గ్రహించి పూజించిన యా గ్రహదోషశాంతి యగుననగా ధర్మరాజు విని గౌరి చరిత్రము నాకు విన్పింపుమని కోరెను. అది విని యిట్లు మునీంద్రుడు ప్రారంభించెను. రాజా! గౌరీదేవి యెవరనుకొన్నావు? మహాశక్తి సుమా! ఆమె యెవరో నేను చెప్పుచున్నాను.

దక్ష ప్రజాపతి కుమార్తెలు యిరువదేడుగురు. వారిలో సతీదేవి యొకతె. ఈ సతీదేవి శివభక్తిపరురాలు శివునారాధించుచు తాను శివపత్నిగా నుండుటకు వాంఛించు చుండెను. శివుని ధ్యానించుచు శివా! నిన్ను నా భర్తగా కోరుచున్నాను నీవు నన్ననుగ్రహించి చేపట్టుమని వాంచించు చుండెడిది. లోకప్రభుడగు శివుడు సతీదేవి హృదయము గ్రహించి యామె భక్తికానందించి తాను చేపట్టదలచెను. దక్షుడు శివుని దయతో సతీదేవి నీయవలయు

నన్న యోచనగల్గినది. శివునకు తన కుమార్తెనిత్తును వివాహమాడుమని వర్తమానము మునులచే పంపెను దానికాతడంగీకరించెను. శివునకు సతీదేవిని సాలంకృతముగా కన్యాదానము గావించి యత్తవారింటికి పంపెను.

ఏ వేళ సతీదేవి కైలాసగిరికి వెళ్ళినదో నాటినుండి పుట్టినింటికి యేనాడు తిరిగి రాలేదు, వారెవ్వరు పిలువలేదు. ఆమె శివునారాధించుచు శివుని భక్తితో ప్రేమతో వినయం చూపుచు భర్తని దయ సంపాదించెను. సతీదేవి యన్న శివుడు ప్రాణప్రదముగా చూచుచు నామె యాంతరంగిక భక్తికి సంతోషపడుచుండెను.

## దక్షుడు శివుని నిందించుట

శివునకు తన కుమార్తెనిచ్చినది మొదలు దక్ష ప్రజాపతి శివునసహ్యముగా చూడసాగెను. ఆతనికి శివద్వేషము పెరిగినది. ఎందులకనగా శివుని దేవునిగా ప్రజలు పూజించుచున్నారు. నాయల్లుడు దేవుడా? నా సతీదేవి పెనిమిటి సామాన్యుడు. వానిని పూజించువారు మూఢులనియు, తాను ప్రజాపతిననియు గర్వముతో తిరుగుచు శివుని గురించి గొప్పగా చెప్పిన వారిని నిందించుచు తిరుగుచుండెను. ఆతని హృదయమెరిగి జగదీశుడు శంకరుడు మౌనముగానుండి తన్ను భక్తితో గొల్చు సతీదేవిని చేరదీసి కాలము జరుపుచుండెను. ఒకానొక సమయములో బ్రహ్మలోకమునకు మహామునులు ప్రజాపతులు, దేవతామూర్తులందరు వచ్చి యొక యాసనమున గూర్చుండెను. ఇట్లు సభజరుగుచుండగా దక్ష ప్రజాపతి వెనుక యాలస్యముగా సభకు వచ్చెను. ఆతనిరాక చూచి వారందరు లేచి గౌరవించిరి.

వారందరు లేచి గౌరవించినను సభలోనున్న శంకరుడు లేవక యట్లే కూర్చుండెను. అది చూచి దక్షుడు మండిపడి నేను మామగారిననియు ప్రజాపతు లలో గొప్పవాడననియు గౌరవించక పొగరుగా శివుడు యెట్లు లేవకుండా కూర్చుండి యున్నాడో! చూడుడు వీడు పాషండుడు గర్విష్ఠి శ్మశానములలో దిరుగుచు భూతాదులను వెంటబెట్టుకొని తిరుగును ఎప్పుడశుచిగా నున్న యీ నిర్భాగ్యుడు సభలో పూజనీయుడా! యనిదుల పరించెను. సదాశాంతమూర్తియగు శివుడు తన్ను నిందించినను పొగిడినను పట్టించుకోనని వాడగుట నవ్వుచూ యూరకుండెను.

ఇట్లు సభలో నగౌరముచేసిన దక్షుడు సభానంతరము తన దారిని తాను పోయెను. శివుడు కైలాసమునకు పోయెను. ఇట్లు వారిద్దరు కొన్నాళ్ళు రాకపోకలు లేకుండా యున్న రోజులలో శివుని పిలువకుండా దక్షుడు యజ్ఞము చేయదలచి దేవగణములను మునులను పిలిచెను.

దక్షుడు యజ్ఞమారంభించెను. దేవవిమానములు పక్షుల గుంపులవలె ప్రయాణ ములు చేయుచు రాకపోకలు సాగించుచుండెను. కైలాసగిరి మీద సతీదేవి వాటిని చూచి మీరందరెక్కడకు పోవుచున్నారు? యింతమంది గుంపులుగా విమాన ప్రయాణములు చేయుచున్నారు చెప్పుడనగా వారు నవ్వి నీ తండ్రి యజ్ఞము చేయుట యే తెలియదా! నిన్ను పిలువలేదా? ఆహాహ! యని నవ్వి వెళ్ళిపోయిరి. సతీదేవి యిది విని తండ్రి పిలువలేదా? యజ్ఞము సాగుచున్నదా? నేను చూచి వచ్చెదననియు నా భర్తనుకూడ నా వెంటగొనిపోవుదుననియుతలచి శివుని వద్దకు వచ్చి యిట్లనెను. శివా! నా తండ్రి యజ్ఞముచేయుచుండ నన్ను పంపలేదా? యిది తగునా? యన్నది శివుడు నవ్వి సతి! నీ తండ్రికి నన్ను నీవు పెండ్లాడిన కారణ

విరోధురాలవైనావు. నన్ను పిలువలేదు. నిన్ను పంపమని కబురు పెట్టి
ు.

అది విని నా తండ్రి పిలువకపోయినను యది యజ్ఞము గదా! యజ్ఞము
వాహమునకు, స్నేహితుని యింటికి పిలువకుండా పోవచ్చునని శాస్త్రము
ఉన్నది మనమిద్దరము పోయి దానిని చూచి మన బంధువులతో కాలము
ము రమ్మనెను. ఆతడు విని యామె యమాయకత్వమునకు యోచించి
చోటునకు పోయిన పరాభవము వచ్చును ప్రయాణము కావలదనెను.
నకమంకుపట్టు పట్టినది. శివుడాలకించి సతి నీవు పోయినపొమ్ము నాకు
లేదు. నిన్ను నేనాటంక పరచననగా సంతస మొంది ప్రయాణమునకు
ను. సమస్తము సర్దికొని పోయివత్తునన్నది. సరి యని యామెతో నందీశ్వ
ను కొన్ని వేలు ప్రమద గణమును పంపెను.

ఆమె పరమానందముగా తన పరివారముతో నందివాహనము మీద
దేరెను. దక్ష యజ్ఞము చేయుచోటునకామె వచ్చెను. ఆమెను చూచి తండ్రి
ంచలేదు. తల్లి యితర సోదరీలు బంధువులు పల్కరించినను తన్ను
ముగా తండ్రి చూచెనని కోపమందెను.

## గౌరీ జననము

సతీదేవి తన్ను యింతమందిలో ననగా మహామునులు, దేవతలు,
లు, సోదరీగణము మొదలగు వారిమధ్య తన్ను పల్కరించలేదన్న
మునుబాలనినది. ఇట్లు పరాభవమంది యింక పెనిమిటి మొగము యెట్లు
ను? ఆయన ముందే నాకు చెప్పినారు. నేను నా పుట్టినిల్లన్న యభిమాన

ముతో స్వతంత్రించినాను. జరుగవలసినది జరిగినది. చాలుననుకొన్నది. యిప్పుడు నా శరీరము నుండి యోగాగ్నిని లేపి యీ శరీరమును భస్మముగావించుకొందునని నిశ్చయించుకొనినది. హోమగుండముల సమీపములో యోగముపట్టినది. యోగాగ్నిని లేవదీసినది అందరూ పరమాశ్చర్యకరముగా విచారముతో చూచుచుండగా నామెదగ్ధమైపోయెను. పెద్దగోలచేసినది. అంతయు దద్దరిల్లి నది. బంధువులందరు పెద్దగా దక్షుని నిందించిరి వారు తమలోని యసత్యము వెలికి గ్రక్కిరి. ఇంత మూర్ఖుడుగా దక్షప్రజాపతి సంచరించునా? కన్నకూతురు గాదా? జాలిలేదా? యనుకొనిరి.

ఈ వార్తను సతీదేవితో వచ్చిన శివుని వారు హుటాహుటి బయలుదేరి విషయము వివరముగా చెప్పగా శివుడాలకించెను. ఆతడు గర్వాంధుడగు దక్షునకు పరాభవము చేయదలచెను. వెంటనే తన జడ నొకదానిని వెలికిలాగి నేలను వైచి కొట్టెను. వెంటనే యందుండి వేయిచేతులు గలవాడు, భయంకరా కారమువాడు. భూమి దద్దరిల్ల శివతాండము చేయువాడు మహాభయంకరుడు గల మహాపురుషుడు దృవించి శివునకు సమస్కరించి నిలబడెను. పిమ్మట నీ యానతి యేమనెను.

శివుడు చూచి "నా ప్రమధగణములకు నీవు సైన్యాధిపత్యము వహించి యీ సైన్యముతో దక్షుని యజ్ఞమును నాశనము చేయ"మని యాజ్ఞాపించెను. వెంటనే యాతడు భూమ్యాకాశములంటిన శరీరముతో నిప్పులు గ్రాలునట్లు కన్నులలో మంటలురేగ భయంకరమగు గర్జనలుచేయుచు హుంకరించు సమూహముతో ప్రయాణమయ్యెను.

తిన్నగా నీ పరశివునివలె నుండి యజ్ఞశాల ప్రవేశించెను. ఆతని సైన్యము నలుదెసలు చుట్టుముట్టి సమస్త హోమగుండములు, యజ్ఞశాలలు

ధ్వంసము గావించసాగిరి. వీరభద్రుడు యజ్ఞమునకు వచ్చిన వారలనందరను పరాభవించెను. దక్షుని తల నరికివేసెను. సూర్యుని పండ్లూండతన్నెను. అందరి కన్ని విధముల నవమానములు గావించి తరిమికొట్టిరి. వారు ప్రాణములర చేతపెట్టుకుని "బ్రతుకుజీవుడా" యని ప్రయాణమైపోవుచుదారిలో నిట్లనుకొన సాగిరి. శివనింద మహాపాపము. శివుడులేని యజ్ఞములేదు. శివుడు సాయుజ్య దాత. ఎంతఘోరమైనపని చేసినాడు. కన్నకూతురుని పలుకరించలేదే! తాను పిలువకున్నను పుట్టింటి భ్రమతో వచ్చిన యాడకూతురును సుంతయైన ప్రేమ లేకుండా యిట్లు చేయునా? చేసినందులకు పరాభవము బాగుగా జరిగినది. మనము బుద్ధిహీనులమై వచ్చినామనియు దైవము తిన్నగా చూచి యీ మాత్రముగా వదలినాడని సంతోషించుచుపోయిరి.

దక్షుని దయదలపమని దేవగణములు ప్రార్థించగా నాతని తల దొరకలేదు. అక్కడపడియున్న యొక యజా ముఖము గొనివచ్చియతికిరి. దానికి శివుడు ప్రాణములుపోసెను. ఇట్లు శరీరము విడచిన మహాయోగిని సతీదేవి శివుని స్మరించుచు, శరీరము వదలినదిగాన యామె మరొక శరీరము ధరించి పర్వతరాజగు హిమవంతునకు మేనకకు కుమార్తెగా జన్మించినది. అట్లు జన్మించి శివదీక్షతో నుండి శివుని ధ్యానించుచు శివుని తప్ప నెవరిని వివాహమాడనని దీక్షతో నుండి హిమవంతు నింట పెరుగుచున్నది. అట్లు పెరుగుచున్న సమయంలో దేవతావసర మొకటి వచ్చినది. దేవసైన్యము నడుపు సైన్యాధిపతికి వారు చూడసాగిరి.

వారందరు బ్రహ్మకడకు పోయిరి. రాక్షసులు మమ్ము బాధించు చున్నారు. వారితో యుద్ధము చేయదలచినాము. మాకు సైన్యాధిపత్యము వహించు వీరుడు కావలయును. దాని కుపాయము చెప్పుమని ప్రార్థించిరి. అది

విని శివుని వలన పార్వతికి జన్మించిన కుమారుడు మీ సైన్యాధిపతియగు ననెను.

వారు శివుని వలన తమసేనాధిపతి దొరుకునని విని సంతోషించి పార్వతీదేవి వృత్తాంతము వినిపించమనికోరగా నాతడు విని యావద్విషయము వినిపించెను. వారందరు త్వరితగతితో కైలాసమునకు పోయి శివుని యిట్లు పొగిడిరి. మహాదేవా! నీవు మాకు నిత్య పూజ్యనీయుడవు. నీ దయలేకున్న జీవించలేము. మమ్మనుగ్రహించి పార్వతీదేవిని వివాహమాడుము. నీ వలన మాకు రాక్షసులతో వచ్చు యుద్ధములలదు సైన్యమును నడుపు వీరు డుద్భవించగలడని బ్రహ్మాశలవిచ్చెను. నీ వివాహము మా కొరకంగీకరించు మని కాళ్ళు పట్టుకుని బ్రతిమాలగా శివుడంగీకరించెను. అతడు దేవతలకుపకారి గాన మారువేషముతో పార్వతిని పరీక్షించుటకు హిమగిరికిపోయి యామె భక్తి, శక్తి సర్వము గ్రహించితానే శివుడని నిజరూపముచూపెను. ఆమె పరమానందమందెను. హిమవంతుడు శివునకు కాళ్ళుకడిగి పార్వతిని యిచ్చి వివాహముగావించెను. గిరిరాజు కుమార్తెగాన పార్వతిని "గౌరీదేవి" యని పిల్చి పూజింతురు.

ఈ చంద్రగ్రహము జాతకున కనుకూలముగా లేనప్పుడు గౌరీ మంత్రజపమున్ను, గౌరీదేవి సహస్రమార్చనను హోమములు, తర్పణ ములు గావించవలెనని సౌభాగ్యవతి పెనిమిటికి వచ్చిన దోషనివారణము చెప్పిరి గదా! వారు చంద్రాదిష్ఠానదేవతను యొక పీఠము మీద బియ్యము పోసి యంత్రము నుంచి కలశము స్థాపించి దీక్షతోనలుబదిరోజులు పూజించిరి. ప్రతిదినము తీర్థప్రసాదము లందుకొనుచు యా రాజవరుడు రోగమునుండి వదలబడివాడగుచుండెను. కొన్నాళ్ళకు చంద్రగ్రహపీడ తొలగి రాజు సంతో

షముతో తిరుగసాగెను. అందుచే చంద్రగ్రహదోషము నివారించు విధానము యొక ముని చెప్పగా వినెను.

ధర్మరాజు విని యిది వరలో సూర్యారాధనముచేసి సువర్ణపాత్ర పొంది యుండుటచే నవగ్రహములను వేరు వేరు విధముగా పూజించిన దోషములు తగ్గునన్న సంగతి విని తన చుట్టునున్న మునీంద్రులను చూచి "మీరు చంద్రగ్రహదోషము పోవుటకు దారి చెప్పిరి సంతోషించినాననెను.

నవగ్రహ పూజామహిమ

## 3 కుజ గ్రహము

ధర్మరాజు జూదమాడిన ఫలితముగా మాట తిరుగకుండా తమ్ములతో భార్యతో యితర బ్రాహ్మణ బృందముతో నరణ్యావాసము చేయుచున్నాడు. ఆతడు ధర్మదేవతగావున యతనిననుసరించి వీరందరున్నారు. వారు పెక్కురకముల గోష్ఠులు జరుపు కొనుచుండిరి. అందులో నవగ్రహములు వారి విషయములు. వాటి దోషములు వాటిదోషశాంతులు వరుసగా వినసాగెను. వారు నవగ్రహములు జీవులకు తోచినను వాటియందు వాటి సంబంధమగు నధిష్ఠాన దేవతలను పూజించినగాని వాటి దోషము పోవదనిరి. అది విన్న ధర్మరాజు మునీంద్రులారా! సూర్యగ్రహోపాసన దానిఫలితము పొందినాను. తరువాత మీరు యి తవరకు చంద్రుని గురించి చెప్పినారు. తరువాతగ్రహము కుజుడుగదా! కుజగ్రహమును గురించి సాంతముగా చెప్పి దాని శాంతి క్రమము యెవరు యెట్లు సుఖపడిరో యే దేవత యాగ్రహాధిష్ఠాన దేవత యో దోష సమయములో యేమి చేయవలయునో వివరించుడనికోరెను.

అప్పుడా మునీంద్రులలో నొక మహాముని నేను యీ నాడు "కుజగ్రహము దాని శాంతి"ని గురించి నీకు వివరింతునని యిట్లారంభించెను. ధర్మరాజా! నవగ్రహములలో లోక వ్యవహారములకు సమస్తరాజకీయములకు శాసనబద్ధముగా నడక ప్రజలచే నడుపుచు తమకు తిరుగులేని విధముగా ప్రజలను నిగ్రహించి చేతబట్టియుంచుటకు కుజగ్రహము ప్రధానమైనది. అన్ని గ్రహములలో రాజకీయముగా చెప్పదగ్గది మొదటిది కుజగ్రహము తరువాత చెప్పవలసినది రవి గ్రహము. ఈ రెండు బలవత్తర రాజకీయ గ్రహములు మీ వంటి వారు రాజ్యాధిపత్యములందినారన్న కుజగ్రహబలమే బలము.

అతనినే యంగారకుడందురు. అతడు బలవంతుడై శుభస్థానములందున్నను, శుభగ్రహములు చూచుచున్నను శుభగ్రహములతో కలసియున్నను యెంత మేలుచేయునో చెప్పజాలము—భూమండలాధిపత్యము, భూపతిత్వము దాసదాసీ, సైన్యాధి బలము కల్పించగలదా గ్రహము ఆ కుజ గ్రహమనుకూలముగా లేకున్నను దుష్టగ్రహ సంబంధములున్నను, దుష్ట స్థానములందున్నను వాని కాలమందు పడరానిపాట్లు కల్పించును. కూటికి గుడ్డకు కరువు వాచునట్లు కట్టు వస్త్రములులేక కౌపీనములు ధరించునట్లు భిక్షాటనముగా పెంచునట్లు, ప్రజల విరోధములు కల్పించునట్లు తీరరాని విరోధములు వాటంతటవే వచ్చునట్లు యెన్నో బాధలుపెట్టగల సామర్థ్యమా గ్రహమునకు గలదు. యిది కుజగ్రహ విషయమనగా విని మునీంద్రా! ఆ గ్రహమంతటిదన్నారు. సరియే దాని నుండి విముక్తిచెంది సుఖపడదలచినవారు యే విధముగా సెవరినారాధించవలయును. ఆ గ్రహశాంతి విషయము సవిస్తరముగా చెప్పమని కోరెను. అది విని మునీంద్రుడిట్లారంభించెను. ధర్మరాజా

కుజగ్రహము జాతకములో ననుకూలముగా లేనప్పుడు దానికధిష్టాన దేవత కుమారస్వామి. ఆ కుమారస్వామి నారాధించినచో నలుబది దినములలో దాని ఫలితము పొందగలరు. కుమారస్వామి యంత్రమును యొక పళ్ళెరములో నిండుగా బియ్యముపోసి దానిపైన యొక పత్రములో యంత్రముంచి కలశ స్థాపనము గావించవలయును.

దీక్షతో నా యంత్ర బలము పెరుగుటకు కుమారస్వామి మంత్ర జపము చేయుచు పూజలు గావించుచు తర్పణ, హోమములు గావించుచు యా స్వామి కర్పణముగా ఫలమువదలుచు యిది వరలో చెప్ప బడ్డట్లు నలుబది రోజులు చేయ వలయును. అట్లు దీక్షతో చేయువారికి వారి జాతకము నందున్న కుజ దోషము తగ్గుననగా విని ధర్మరాజు యిట్లు ప్రశ్నించెను. కుమారస్వామిని గురించి యిది వరలో చంద్రగ్రహ విషయములో సూచించినారు గద!

యిప్పుడా కుమారస్వామి జననము ఆయన చేసిన పనులు, కుజ దోషము పోగొట్టుకొనుటకా యంత్రము యెవరికి పని చేసినది నాకు సవిస్తర ముగా చెప్పుదని కోరగా నా మహాముని యిట్లారంభించెను. ధర్మరాజా! కుమార స్వామి బలము ఎంతటిదో వర్ణించజాలను.

అతని నారాధించినవానికి గ్రహదోషములు అనగా భూతప్రేతాదుల భయములు, గృహదోషములు, గర్భదోషములు అనగా సంతానహీనత, సంతాన నష్టము, సంతాన విరోధాది దుష్టఫలములు తగ్గించును. మహామహి మాన్వితుడా కుమారస్వామి. యిప్పుడాతని జననము వివరించి యెవరు యెట్టి దోషముల నుండి విముక్తి జెందినారో తెల్పెదనని యిట్లారంభించెను. యిది వరలో చెప్పబడినట్లు శివుడు మారురూపమున పార్వతీదేవిని జేరి యామె

భక్తి పరీక్షించెను. తరువాత వివాహమాడెను. పార్వతి శివుడు కైలాసగిరిమీద సుఖముగా కాలము జరుపుచు నన్యోన్యముగా నుండి తిరుగసాగిరి. ఇట్లు కొంత కాలము జరిగిన తరువాత వారచ్చట నున్న యొక చతుష్పాద దంపతుల క్రీడ చూచుట తటస్థించినది శివుని వీర్యమా విషయములో గళితముకాగా దేవతా కోటిచే పంపబడి యదృశ్య రూపమున నున్న యగ్నిహోత్రుడు నేల బడకుండా తాను ధరించెను.

అట్లు చేతబట్టుకొని యెవరికి వీర్యము గర్భధారణకు సమర్పింప వలయునని యోచించుచుండెను. రాను రాను యా వీర్యము భారముగా నుండి తాను భరించలేకపోయెను. ఏమి చేయుదునా? యని యోచించి సముద్రములో బడబాగ్ని యున్నది. యిప్పుడిది కూడ దాని వంటిదే అందుచే నేను యీ వీర్యము భద్రముగా సముద్ర జలములనుంచెదను. యిది మార్గమని భావించెను. మహా పవిత్రము. భారమునకు శివ వీర్యమును మోయలేక మోయలేక మోసికొని సముద్ర తీరమున నున్న రెల్లు దుబ్బులను చూచి యందుంచెను.

ఈ వీర్యము జ్వాజ్వల్య మానముగా ప్రకాశించుచు రెల్లుదుబ్బుల గరుకు తనములో విడిపోవసాగెను. ఆ సమయములో షట్కృత్తికలు (ఆరుగురు) సముద్రతీరమునకు స్నానమునకు వచ్చి యీ వీర్యమారు భాగములగుట చూచి వారు దానినేకము చేయగా బాలకాకృతి పొందెను.

## కుమారస్వామి - దేవ సైన్యాధిపత్యము

వారికి సంతానములేని కారణమున వారా బాలుని తమ పుత్రునిగా భావించి పెంచసాగిరి. అందుచే కుమారస్వామిని శరణభవుడనియు, షాణ్మాతురుడనియు బిరుదు నామములతో బిలుచుటలవాటుపడినది. శరవణమనగా

రెల్లుగడ్డి యా రెల్లులో జన్మించుటయు, షాణ్మాతురుడనగా ఆరుగురు తల్లుల కేకైక పుత్రుడుగా నుండిన వాడగుటచే యా బిరుదు నామములు కుమార స్వామికి వచ్చినవి. అట్లాతడు జన్మించి క్రమముగా పెద్దవాడయ్యెను. యిది ఇట్లుండగా దేవతలకు రాక్షసులకు బద్ధవైరముగా నెల్లకాలముండును. వీరిద్దరు సవతి యన్నదమ్ములు కశ్యప ప్రజాపతికి నలుగురు భార్యలు వారిలో దితి, అదితి వినత, కద్రువయనువారున్నారు. దితి పుత్రులు దైత్యులు లేక రాక్షసులు, అదితి పుత్రులు దేవతలు, యింద్రాదులు, వినత కుమారులు నూరుడు, గరుత్మంతుడు వారి బలము పక్షిజాతులు కద్రువ సంతానము సర్పములు.

వారిలో శేషుడు, తక్షకుడు, వాసుకి, కర్కోటకుడు మొదలగు మహా వీరులున్నారు. దేవతలకు రాక్షసులకు స్వర్గరాజ్యాధిపత్యము గురించి నిత్యము కలహములాడుట పరిపాటి స్వర్గరాజ్యమనగా మూడు లోకములకు ప్రభువులై ప్రభుత్వము సాగించువారు యింద్రాది దేవతలు వారిని తరిమికొట్టి సింహాసన మాక్రమించుటకు రాక్షసులు ఘోరమగు తపములాచరించుట మనము వినిన విషయము గాదా? ఆ రాక్షస వీరులే గద రావణుడు, కంసుడు, హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు, మహిషాసురుడు, చండముండాదులు చరిత్ర ప్రసిద్ధులుగారా? వారు యెంతో కాలము తపములు చేసి వరములు పొంది స్వర్గరాజ్యాధిపత్యము సంపాదించినారు గద!

ఈ రాక్షసులన్న వారు బ్రహ్మజాతివారే ఘోరమగు తపములు చేసి యోగ బలమును సంపాదించి బ్రహ్మను, శివుని వశము గావించుకొని వరము లంది తమ బలముచూపి నడచినారు గద! వీరెప్పుడు దేవతలను వేధించువారే !

అట్టి బ్రహ్మ సంతతిలో వృత్రుడను రాక్షసరాజు యొకడు గలడు అతడు తపము చేయుచు యోగనిష్ఠలో నున్నాడు. మహా ఘోరమగు తపములో నిదివరులోనున్న తన వానిని యింద్రుడు వజ్రాయుధముతో శిరస్సును ఖండించి నాడన్న క్రోధము బూని తాను తపోబలము సాధించి యింద్రుని శిరచ్ఛేదము గావించు కోరికతో కొన్ని వేల సంవత్సరములు తపమాచరించెను. అతడు చేసిన తపము బలవత్తరమగుటచే నెవ్వరు దానినాటంక పరుపజాలిరి. అతడు తపో బలముగ్రముగా సంపాదించెను. అతని తపస్సునకు దేవతా గణములు బేజారై పోయినవి. వీని వధించుట యెట్లు? యన్న సందేహములో నుండెను వాడు చేయు తపము యింద్రుని తల నరకుటయే పరమావధి గాన యింద్రుడు కూడ భయపడుచుండెను. ఘోరమగు తపములో నుండి శరీరమును కృశింపజేసి తదేక నిష్ఠలో నుండగా వాని తపమునకు బ్రహ్మ మెచ్చుకొని ప్రత్యక్షమయ్యెను.

అతడు బ్రహ్మపాదములకు మ్రొక్కి స్తవములు చేయగా నాతడా నందపడి లేవదీసి యిట్లనెను. వృత్రా! నీవు చేసిన తపమునకు మెచ్చుకొన్నాను. ఇంక నీవు తపము చాలింపుము నీకు వలయు కోరికల నిత్తును కోరుకొమ్మనెను. అతడానందించి పరమేష్ఠి! నిన్నారాధించిన ఫలితముగా నన్ను యుద్ధములో నెవడు జయింపజాలని వరము ప్రసాదించమన్నాడు. అతడట్లే యిత్తును ఒక్కటి చెప్పుచున్నాను బ్రహ్మ బలముకన్న శివ వీర్యము మహాబలము గలదిగా నెరుగుము నీకు శివపీరోద్భవుని వలన మాత్రమపజయము గల్గును. మిగిలిన దేవతా గణము లింద్రాదులు నిన్ను జయింప లేరనెను.

అదివిని శివవీర్యోద్భవుడు వీరికెక్కడ దొరుకును? ఆతడు సన్నేమి చేయును? నాకు వారికి సంబంధమేమున్నది? యింద్రాదులను జయించుటయే ప్రధానమని సంతోషించి తన రాక్షస సైన్యమును చెల్లాచెదరైన దానిని కూడగట్టు కొనెను.

తరువాత యింద్రుని మీదకు యుద్ధము ప్రకటించెను. తాను దండెత్త దలచినానని శూరత్వముతో నిలుతునని ప్రగల్భములు పోవసాగెను. యిది యిట్లుండగా దేవేంద్రుడు యీ విషయము విని బ్రహ్మదేవుని దర్శించి దేవగణముతో నమస్కరించి యిట్లనెను. దేవా! వృత్రాసురుడు నాపైదండెత్తి రానున్నాడు. నీవు వానికి వరములిచ్చి యింతగా చేసినావు. మాకు వానిని జయించుటకుపాయము గూడ చెప్పగోరదనని విని నీకు శివ వీర్యోద్భవుడు కుమారస్వామిని దండనాధునిగా చేసికొని యుద్ధము చేయుము ఆయన నిలబడిన శివుడు నిలబడినట్లే భావించుము నేను వరములిచ్చునప్పుడే చెప్పినాను. శివవీర్యోద్భవుడు నీకు జయము రానీ యుడు. అది తెలిసీ యుద్ధ మాచరింపుమని ముందే చెప్పినాను. నీకు జయము తప్పదు. జాగ్రత్తగా సంచరించుమని యాదేశించిపంపెను. దానితో తృప్తిపడి దేవేంద్రుడు తన రాజధానికి మళ్ళీ వచ్చి యుద్ధ ప్రయత్నములో నుండెను.

వృత్రాసురుని జుయించుటకు దేవసైనాధిపత్యము వహించి కుమార స్వామి ముందునకు వచ్చెను. యిది యిట్లుండగా పురోహితుని సలహానను సరించి వృత్రుడు యుద్ధమునకు దిగెను. ఘోరముగా యుద్ధము సాగుచున్నది. ఉభయ పక్షములవారు వారి వారి బలముననుసరించి శత్రుభయంకరము పోరాడుచుండిరి. కుమారస్వామి నాయకత్వముతో శత్రుసైన్యములు నాశనమగుచుండెను. తపో బలముతో వృత్రాసురుడు పెరుగుచుండెను. కుమారస్వామి మహాఘోరముగా

సైన్యమును నడిపించుచు సాగుచున్న వానిని జయించుట కష్టసాధ్యముగానున్నది. వాని బలము ముందు యింద్రుడాగలేకపోయెను. వాని ఆయుధములన్నియు వ్యర్థములుగానుండెను.

ఎట్లైన వానిని జయించదలచిదానికి తగిన మార్గముగా తన పురోహితుని సలహా వేడెను. యింద్రా! నీకు యీ తపశక్తి ముందు యేయాయుధములు పని చేయవు అందులకు నీవు కూడ తగిన మార్గమాలోచించుకొనవలయును దానికి తగిన మార్గమొకటేకలదు. దానిని నీవాచరించుమనవిని యాతడిట్లనెను.

ఏ మార్గములో నన్ను మీరాచరించమన్న యా మార్గములో నడచెదను. నాకు జయమువచ్చు మార్గముపదేశింపుడన యా పురోహితుడు యిట్లనెను. ప్రపంచమంతయు నారాయణమయము సృష్టిలోనాతడు లేనిచోటులేదు. నీవా నారాయణు నాశ్రయింపుము ఆ నారాయణుడు కవచరూపమున నీ శరీరమంతయు నిండి యుండును. నీకు బలతేజములు నిండుగా నిచ్చి జయముకూర్చును. ఆతడు సర్వాంతర్యామియనియు మన హృదయములలోనున్నాడన్న జ్ఞానముతో మసలిన నాడు యే యపజయమురాదు కావున నీకుపాయముగా నారాయణకవచమను మహా మంత్రముపదేశించెదనని యింద్రునకుపదేశిచెంను. యింద్రుడది గొని నారాయణ కవచము పారాయణముగావించి తన వజ్రాయుధమును భావించెను శ్రీమన్నారాయణుడ యందుండ సాగెను.

వృత్రునకు తపోశక్తి తగ్గసాగెను. అందులో నారాయణుడు దేవతా పక్షపాతమువాడని యొక యపశ్రథమతో రాక్షసులుందురు. అందుచే నారాయణ విరోధముతో సంచరించుచుందురు. అందుచే వృత్రుడు చనిపోవుటకు నారాయణుడే కారణముగా కవచ మహిమచే వజ్రాయుధము తళ తళ మెరసిపోవుచుండ

వానిని సంహరించెను. నాటినుండి కుమారస్వామి దేవసైన్యాధిపత్యము గాంచి యుండెను. ఆ కుమారస్వామి పత్యక్ష శివుడు ఆతని నారాధించినవారికి సర్వకార్య సిద్ధులు జరుగును. అంగారక గ్రహమునకు కుమారస్వామి యధిష్ఠాన దేవతగా నిలబడెను. అంగారక దోషము యీ స్వామిని పూజించిన తగ్గునని చెప్పగా విని యెవరు యీ ఫలితమును పొందిరో చెప్పుమనగా మునీశ్వరుడిట్లనెను.

ధర్మరాజా! నీకు యీ విషయము చెప్పుచున్నాను. పూర్వము కళింగ దేశాధీశుడు యొకడు చక్కగా రాజ్యము పాలించుచుండెను. ఆతడు సుఖముగా నుండునట్లు ప్రజలను చూచుచుండెడివాడు. రాజ్యము సుఖముగా నుండగా కొన్నాళ్ళు జరిగినది.

ఆతనికి గ్రహబలము తగ్గిన సమయములో నంగారకుని దశ వచ్చినది. అది దుష్టగ్రహములు దృష్టిపడుటచే రాజునకు దాయాదులతో విరోధము గల్గినది. వారు వాని రాజ్యమును కొల్లగొట్టదలచి యర్ధరాత్రమందు దండెత్తి వచ్చి వాని మంత్రుల దురాలోచనముతో రాజ్యము స్వాధీనముచేసికొనిరి. ఆతడు కట్టుబట్టలతో రాజ్యము విడిచి కారడవులపాలయ్యెను. అతడు తన ముఖ్యమంత్రి యొకడు తన్ను వెంబడించగా కందమూలాదులు తినుచు కాలము జరుపుచుండెను. అంగారక దోషమున్నట్లు గ్రహించక యాతడు నానా బాధలు పడుచుండగా యొక మహా నీయుడా ప్రాంతమునకు వచ్చెను. బ్రహ్మ తేజముతో నిండిన యా మహామహుని కర్ఘ్యపాద్యాదులచే పూజించి కూర్చుండజేసెను. తరువాత తన గోల వినిపించెను. ఆతడు దూరదృష్టిగలవాడు చక్కగా పరిశీలించగా వాని కంగారక దోషము గన్పట్టినది. రాజా! నీకు యీ దోషము ప్రారంభించియైదుయేండ్లు దాటినవి. నీకు యింకనొక వత్సరమునకు రాజ్యప్రాప్తియగును. నీ నంగారక శాంతికై కుమార స్వామి నారాధించుమని యంత్రమిచ్చి పూజించుము. నీ శత్రువులు స్వాధీనమగు దురని దీవించెను.

ఆ కళింగరాజు యా మహానీయుడొసంగిన యంత్రములు గొని యంగారకదోష నివృత్తికై మండల దీక్ష ప్రారంభించెను. ఎంతో శ్రద్ధాశక్తులతో శక్తికి సరిపడునట్లు పూజ జపము, తర్పణాదు లాయన చెప్పినట్లు చేయసాగెను. రాజునకు దోషము యీ కుమారస్వామి యారాధనముతో సన్నగిల్లిపోవసాగెను తన రాజ్యములో దాయాదులదుండగములకు ప్రజలు తిరుగుబాటుచేసి రాజు వద్దనున్న ముఖ్యమంత్రికి వారందరూ స్వాధీనమైపోయిరి.

అతడా ప్రజలను సైన్యమున తన మంత్రాంగముతో స్వాధీనపరచుకొని వారు చేసినట్లు కళింగాధీశుని దాయాదులను సంహరించిరి. తరువాత ప్రజలు యూ రాజునకు పట్టాభిషేకముగావించి రాజ్యమునందునిల్పిరి. యిది యంగారక గ్రహ పూజా బలముతో స్వాధీనముగాని రాజ్యాదులు, యితర బాధలు తొలగి వారి నున్నత స్థితి లెచ్చును.

## నవగ్రహ పూజా మహిమ

## 4 రాహు గ్రహము

అరణ్యవాసము చేయుచున్న ధర్మరాజుతో పెక్కుమంది మహామునులు యిష్టాగోష్టిచేయుచున్న సమయములో "యిది వరకు చెప్పబడిన మూడు గ్రహములు వాటికి చెప్పబడిన యధిష్ఠాన దేవతారాధనము గురించి చెప్పియున్నారు. అందరు నవగ్రహములే దోషకారులనియు వారిని పూజిం

చిన దోషములు పోవుననియు వాటికై జపములు చేయుటయు జరుగుచుండును. గాని యీ యధిష్టాన దేవతలను పూజించిన గాని యా గ్రహముల శాంతి జరుగదని తెలియదు. ఇప్పుడు మీతో చేసిన సహవాసబలముతో నే నెరుగని విషయములు తెలియవచ్చినవి. గ్రహములు వారి యధిష్టాన దేవతలను గురించి విన్నకొలది పరమానందమగు చున్నది. వాటి యుత్పత్తులు బలము సమస్తము మీ వలన తెలియబడుచున్నది. సజ్జన సహవాసముతో నందులో మీ వంటి మహా మునులతో నున్నప్పుడే విషయములు వివరముగా తెలియబడుచుండును.

ఇప్పుడు నాల్గవ గ్రహము రాహువును గురించి నాకు వినిపింపుడని యిట్లనెను. రాహువు గ్రహము యెటువంటిది? దాని బలములో నెట్లుపయోగించును? అది బలము లేనప్పుడు యితర పాపగ్రహములందున్నప్పుడు యే నష్టములు చేయును? ఆ నష్టములు తీరుటకు యే దేవతనారాధించవలయును? ఆ దేవత యెవరు? నాకు దానిని గురించి సవిస్తరముగా చెప్పుడని కోరెను. వారా ధర్మరాజు మాటలాలకించి సమాధానముగా నిట్లు చెప్పదొడగిరి. ధర్మరాజా ! వినుము.

నవగ్రహములలో రాహువు తీవ్రగ్రహముగా చెప్పుదురు. రాహువు, రవి, కుజుడు యివి తీవ్రమగుననీ అనగా మేలు చేసిన పట్టుదలతో చేయును కీడు చేసిన నేలకు పైచికొట్టి యెన్నడూ సహించరాని బాధలుపెట్టగలవు చంద్రుడు, బుధుడు, శుక్రుడు, గురుడు యివి సౌమ్య గ్రహములు వీరు పకారములు చేయుటయందు సౌమ్యముగా చేయగలరు. అపకారములు కూడ పాపగ్రహములు చేయునంత బాధాకరముగా చేయజాలరు. పాపగ్రహములు పాపస్థానములందును, శుభగ్రహములు శుభస్థానములందున్నను యోగము చేయుదురు. శుభస్థానము

లనగా జాతకములో లగ్నము, నాల్గవయిల్లు, ఏడవయిల్లు, పదివయిల్లు శుభములు యిచ్చు శుభగ్రహములకు స్థానబలము గలవగును. పాపగ్రహములకు మూడవ స్థానము, ఆరవస్థానము. ఎనిమిదవ స్థానము, పదకొండవ స్థానము, పండ్రెండవ స్థానము బలములిచ్చునవిగా యెరుగవలయును. అందుచే రాహువు తీవ్ర గ్రహ మగుటచే దాని గుణ విశేషములు వర్ణింతును ఈ గ్రహము మూడింట నుండినను ఆరింట నుండినను, యెనిమిదింటనున్నను మంచి బలము గలదియై జాతకునికి గొప్ప యోగము గల్గించును. అనగా తీవ్రగ్రహము దశ వచ్చినప్పుడు బలవంత మగు కార్యములు జరుపుచు, ప్రళయమగు రాజయోగము నడుపును. సంఘ నాయకత్వము గల్పించుట యందు, బలవత్తరమగు రాజ కార్యములు నిర్వ హించుట యందు, ధర్మ కార్యములు చేయుట యందు నుపయోగించును

అతడు వ్యతిరేకముగా నున్న కాలమందు జాతకుని నానా విధము లగు హింసలు పెట్టును. స్థానచలనము, బంధువిరోధము, పదవీ భ్రష్టత, రాజ కీయక్షోభ, కారాగారవాసము, సన్నిహితబంధు మరణము, శరీరాపాటవము, మరణ లక్షణ పీడ యిటువంటివి యెన్నో చెడుగులు చేయగలడు. అట్టి సమయములో రాహువు పాపస్థానములందుండుటయో, పాపగ్రహ వీక్షణమో సంబంధమో పట్టి యుండును. నీకు కూడ యట్టి గ్రహదోషము వలననే యిది వచ్చినది. లేకున్న రాజ్యాధికారము పోయి యరణ్యవాసము వచ్చినది గదా!

దానిని గురించి ముందు వివరించెదము. ఇప్పుడీ రాహువు కీడు చేయు స్థలములందున్నచో నెవరి నారాధించవలయునో చెప్పెదమని మహా

మునులలో నొక మహనీయుడు ధర్మరాజునకు యిట్లు వివరించుటకు ముందు ప్రారంభించెను.

ధర్మరాజా! రాహువు చెడు స్థానములందుండి యపకారము చేయు నప్పుడు రాహు గ్రహమున కధిష్టాన దేవతగా దుర్గాదేవిని చెప్పిరి. ఆ దుర్గా యంత్రముగొని వచ్చి యొక శుభ సమయములో రాహుగ్రహపీడ తొలగుటకు పూజించ వలయును ఒక పవిత్ర స్థలమునందు గోమయముతో నలికి ముగ్గులుతీర్చి పీఠముంచి బియ్యము నిండుగా పోసి దుర్గా యంత్రమునందుంచి కలశ స్థాపనము గావించి రాహుగ్రహ దోష నివృత్తికై యారాధించునట్లు సంకల్పము చేసి నలు బది దినములు జపము, పూజ తర్పణములు గావించవలయును. అట్లు శ్రద్ధాశక్తు లతో చేసిన వారికి రాహుగ్రహ బాధ నివారణమై శుభములు గల్గించును. అధి ష్టాన దేవతల నారాధించిన యా గ్రహములు నారాధించిన ఫలితము వచ్చునని శాస్త్రములు చెప్పుచున్నవని విని ధర్మరాజు మునీంద్రులార! మీరు చెప్పిన దుర్గా దేవి యెవరు? ఎప్పుడుద్భవించినది? వాటిలో భేదములున్నవా? చెప్పుమని కోరెను.

వారు విని దుర్గాదేవిని గురించి యిట్లారంభించిరి. ధర్మరాజా! యీ దుర్గను నవ విధములుగా నవ దుర్గలుగా చెప్పుదురు. అసలు దుర్గ ప్రాదుర్భా వమును గురించి చెప్పెదను వినుము. పూర్వము మహిషుడను రాక్షస రాజుం డెను. అతడు బలసంపన్నుడు వారిలో పెక్కుమంది రాక్షసవీరులు జన్మించిరి. చండుడు, ముండుడు, రక్తబీజుడు, రక్తాక్షుడు మొదలగు వారలు యెవరికి స్వాధీనముగా నుండకుండ దేవేంద్రాది దేవతలను బాధించుచుండిరి. స్వర్గము మీదకు దండెత్తి వచ్చుచు దేవతలను నానా హింసలు పెట్టుచు వారి రాజ్యము నాక్రమించసాగిరి వారిని యడవుల పాలుచేసి యా భోగములనుభవించుచు

పొగరుతో తిరుగసాగిరి. వారందరూ తపస్సుచేసి బలము సంపాదించిన వారు గాన సామాన్యముగా నెవరికి స్వాధీన పడకుండిరి.

వీరి బాధలు యెక్కువగుటచే చేయునది లేక బ్రహ్మాదుల వద్దకు దేవతలు పరుగెత్తి వారి బాధలు చెప్పుకొసాగిరి. వారు విని యిది యొకరి వలన జరుగునది కాదు. అందరు యేకీభవించవలయునని యనుకొనిరి.

## దేవ తేజో రూప దర్శనము

పిమ్మట బ్రహ్మదేవుడు వారిని వెంటబెట్టుకొని శివకేశవులను దర్శించి వారితో వీరి బాధలు వివరించిరి. ఇట్లు దేవగణములు, త్రిమూర్తులు, దిక్పాలురు, వారందరు యొకపై యోచించు సమయములో బ్రహ్మ శరీరము నుండి యొక తేజము శివకేశవుల శరీరము నుండి రెండు తేజములు బయటకు వచ్చినవి. యీ యీ మూడు తేజములు కలసి యొక మహా తేజమైనది. వారందరూ చూచి వెరగుపడుచుండ యా తేజములు కలయిక యొక స్త్రీ రూపముగా మారినది. ఆమె యష్టభుజములను స్త్రీ రూపమువహించి వారిని చూచి యిట్లనెను. మీరందరు నన్ను యెందుకిట్లు చూచుచున్నారు? నా వలన యే పని కావలయునని వాంఛించుచున్నారనెను. వారు విని యామెకిట్లనిరి. నీవు మహా శక్తుల సమ్మేళనమైన రూపమువానవు. నీ యందుండు బలమెవరికి గానరాదు నీకు యెవరు వ్యతిరేకించజాలరు. సమస్త సృష్టిలో నుండి యందరకు బలమునిచ్చు పూజనీయ దేవతవు.

నీ ముందు త్రిమూర్తులు వ్యతిరేకించరు. నీవా కారము చెందిన తరువాత నీ బలము నెరిగితిమి. మా బలములన్నియు నీకే యిచ్చి మా పని తేలికగా చేసి కొందుము. యిప్పుడు నీవు చేయవలసిన పని చెప్పుచున్నాను. మహిషుడను రాక్షసరాజు గర్వముతో తిరుగుచున్నాడు. తపోబలముతో, క్రొవ్వియున్నాడు. వానినెవరు సంహరించలేరు. వాడు బ్రహ్మమున యెవరి వలనను మరణము లేకుండా వరమడిగినాడు. ఈ బ్రహ్మ సమ్మతించి యిచ్చెను. అందుచే వానిని సంహరించలేమని మేము జంకుచున్నాము. వాడు కోరిన వరములలో నందరినిగురించి యడిగి స్త్రీ వలన మరణము మాత్రము రాకుండానడుగలేదు.

నీవు యీ లోకువతననుసరించి వానిని సంహరించి యీ దేవతా కోటిని రక్షించుము. వీరు నిన్ను సదాభక్తితో పూజించుచుందురు. వారికి నీవే యండవు. నిన్ను మించిన శక్తిలేదు. నీవు సృష్టియంతయు ప్రకృతిగానుండ గలవు. లోపల పురుషునిగా ఈశ్వరుండుననిరి.

అది విని యామె యిట్లనెను. మీరు చెప్పినదంతయు వింటిని నా బలము గ్రహించితిని. నీ కడ్డులేదని మీరన్నారు. వాడు వివిధాయుధములుగల్గి సేనా సమేతుడై యున్నాడు. నాకు సైన్యము, బలము, ఆయుధములు చూపిం పుడు నేను పోయి యా మహిషుని సంహరించెదననెను. వారు వెంటనే యా దేవినిచూచి "ఓ శక్తీ! నీకు మేమాయుధము లిచ్చుచున్నాము. బ్రహ్మదేవుడు దండమునిచ్చును. శ్రీహరి చక్రాయుధమిచ్చును శివుడు శూలమునిచ్చును. యముడు దండము నిచ్చును కుబేరుడు స్వర్ణపాత్రనిచ్చును. హిమవంతుడు నీకు వాహనముగా సింగమునిచ్చును. యింద్రాదులు, వారి వారి యా యుధ

ములనిచ్చెదరని చెప్పగా వారందరామె కాయుధములిచ్చిరి. వాటిని ధరించు టకా దేవి శరీరము విదిలించినది. వెంటనే యెనిమిది చేతులు వచ్చినవి. ఆ చేతులతో వాటి నొక్కొక్కదాని నొక చేతితో ధరించినది. హిమవంతు డిచ్చిన సింగమెదుట నిల్వగా వెంటనే దానిపైకెక్కి కూర్చుండినది. తన వాహనమును కాలితో తాటించినది.

అది పెద్ద గర్జన భూమ్యాకాశములు మారు మ్రోగచేసినది. దేవ గణమంతయు కోలాహలముగా నుండి యా దేవికి బహువిధములజేజేలు కొట్టి నారు. ఆమె కోటి సూర్యులవలె ప్రకాశించుచుండెను. వారందరావెల్గునుచూచి మహానందమందుంచు యట్లే చూచుచుండిరి. సింహ వాహనమెక్కినది వారం దరు చూచి యిట్లనిరి ఓ శక్తి! నీకు బలము ప్రత్యేకముగా నక్కరలేదు. నీవు తలచిన మాత్రము మహాశక్తిలన్నియు స్త్రీ రూపములు ధరించి నీ సైన్య ముగా మారగలదు. వారికి నీ స్వరూపములనంతముగా పుట్టి వారాహికార సింహా, జ్వాలాముఖి మొదలగు నామములతో నుండి నాయకత్వమువహించ గలరు.

వారందరు నవకోటి మహాగణముగా నుండగలరు. నిన్ను దర్శించ దలచు వారు నీకు నివాసముగా మణిద్వీపమనబడు మహాప్రదేశములో చూడ గలరు. ఆ ప్రదేశమునకు వచ్చు పురుషులు గూడ స్త్రీరూపధారులగుదురు. నీకు జయమగును. ఈ దేవతాగణము నిన్నదృశ్య రూపము వెంటాడగలరనెను.

## సింహవాహన దేవి ప్రయాణము

వారందరూ జయ జయనాదములు చేయుచుండగా నవకోటి మహా మంత్రములుస్త్రీశక్తులుగానదృశ్యముగా వెంటరాగ సింహ వాహనమునెక్కి పరమసంతోషముతో సువర్ణపాత్రలో మధువు పోసికొని త్రాగుచుజేవురించిన కనులతో ప్రపంచమంతయు చూచి మోహములోబడునట్లుండు జగన్మోహిని రూపముధరించి మహిషాసురుని పట్టణప్రాంతమున నున్న తోటలోనికి తన మాయాబలముతో ప్రవేశించినది. తనకు తోడు యిద్దరు స్త్రీలు ముఖ్యమంత్రాధిష్ఠాన దేవతలు చెలికత్తెలైయుండగా శ్వేతవస్త్రము ధరించినది. నడుముచుట్టు చీరచెంగు చుట్టబెట్టినది. ఎనిమిది చేతులనిండా సువర్ణభూషణములు, భయంకరా యుధములు. శిరస్సున నవరత్నములు పొదిగిన దివ్యకిరీటము నడుము చుట్టు సువర్ణమణిమయమగు నొడ్డాణము ముక్కు నత్తు చెవులకు కమ్మలు ధరించి మిల మిల మెరయుచుండెను.

ఇట్లు బహుసుందరరూపముతో సింహముపై కూర్చుండి ప్రపంచ మంతయు నదురునట్లు భయంకరమగు నొక గర్జనముగావించినది. ఆ గర్జన చేయుటలో నామె మహిమనకు తనరాక తెలుపటయను నర్థమిమిడియున్నది. అట్లు మహాగర్జనము చేయగా నది విని మహిషుని నగరమంతయు గడ గడ లాడినది. సభదీర్చి యున్న మహిషాసురుడీ కేకకు దద్దరిల్లెను. వారి మంత్రి మండలి యొక ప్రక్కకొదిగిపోయిరి. కొంతసేపటికి తేరుకొని మహిషుడు తన మంత్రులను బిలచి యిట్లనెను. ఓ మంత్రులార యిప్పుడు పిడుగు వంటి ఈ ధ్వని యెక్కడనుండి వచ్చినది?

యింత నిర్భయముగా నెవరు మన పట్టణప్రాంతములో నిలబడి బొబ్బపెట్టగలరు. యిది దేవతల మాయకాదు గదా! ఎవరినీ నమ్మరాదు. మనమా ధ్వనించిన చోటునకు మనవారిని పంపి చూచెదము. ఆపై విషయ మాలోచించు కొందుమనెను.

వారు రాజాజ్ఞ ననుసరించి వెంటనే యా ధ్వని వచ్చిన ప్రదేశము వైపునకు వేగముగా నడచిపోయిరి. అది మహిషాసురుని యుద్యానవనము అందులో చెలికత్తెలతో సింహవాహనమునెక్కి మధుపానము చేయుచు మత్తిల్లినకనులతో నన్నెడూ చూడని దివ్య మంగళ సుందరరూపమును చూచిరి. వారా రూపమందిన సౌందర్యవతిని చూచి చూచుటకే తమకు తెలి యని భయమంది వెంటనే తిరిగిపోయి రాజును సమీపించి యిట్లనిరి. మహా రాజా! తమరిచ్చిన యాజ్ఞతో యా ధ్వనించిన వైపునకు పోయితిమి అది మన యుద్యానవన ప్రాంతమే మేము చొరవగా నా ప్రదేశమునకు పోయి చూచితిమి గదా! చాల చిత్రముగా నున్నదా ప్రదేశము దిక్కులు నిండిన కాంతులు చిమ్ముచు యెనిమిది చేతులతో సింగము మీద కూర్చుండియున్న జగదేక సుందరిని చూచినాము అట్టి రూపము గల యాడుది యీ మూడు లోకములలో కనిపించదు.

హాదా యిద్దరు చెలికత్తెలున్నారు వారితో తిరుగుచున్న యామె యెందులకు వచ్చెనదో! యే కోరికతో నున్నదో తెలియరాదు నిజముగా మీ కీర్తి విని మిమ్ము ప్రేమించుటకు వచ్చినదేమో యనుకొనుచున్నాము. లేకపోయిన మన రాజ్యమునకు వచ్చుటా? మన నగర ప్రాంతములో తిరు గుటా? మన యుద్యానవనములో బసచేయుటా? మనలను పిలువలేక బొబ్బ పెట్టుటా? యివి యన్నియు తమ రూపగుణములు విని వలచి వచ్చినదని

మేము తలస్తున్నామని తమ యూహలని రాజు మెప్పు సంపాదించుకొనిరి. అట్లు వారు చెప్పినది విని మహిషుడిట్లాలోచించెను.

పాపం స్త్రీలు లజ్జగలవారు వారిహృదయములలోని భావములు పనులతో చూపింతురు నోటితో చెప్పలేరు నా యందు మమకారముతో నాకు రాణిగా నుండుటకు యోచించినది, లేకున్న యిక్కడకు రానేల? యిట్లు పెడబొబ్బపెట్టనేల? సందియం లేకుండా నన్ను వలచియేయున్నది.

నే నామె హృదయం తెలిసికొనుటకు నా మంత్రులలో తెలివిగల వానిని పంపి రాయబారం నడుపుదునని తలచి యొక బుద్ధిమంతుడగు మంత్రిని బిలిచి నీవు వెంటనే పోయి యుద్యానవనములో నున్న సుందరాంగితో సంభాషించి ఆమె హృదయం గ్రహించి నాకు రాణీగా వుండునట్లు కార్యానుకూలం గావించమని చెప్పి పంపెను. వాడు వేగముగా దేవి యున్న యుద్యానవనమునకు పోయి యామెను చూచి యిట్లనెను. ఓ సుందరీ! నీవు యిక్కడ యొంటరిగా నెందుల కున్నావు? ఎక్కడి నుండి వచ్చితివి? మా మహారాజుతో మాట్లాడ దలచిన నీకు సందియ మక్కరలేదు. నేను నీకుపాయం ననుసందానం గావించెదను. మా మహారాజు మంచివాడు. ఎందరెందరో దేవకాంతలు వరించినను సమ్మతించలేదు నీకా యదృష్టం పట్టింతును. మేమందరం నీకు సేవలు చేయుదుము. నీవు సమ్మతించిన చాలు నాతో రమ్ము! శుభముగుననెను.

ఆ మాటలు విన్నదాదేవి వానిని చూచి గర్వముగా మత్తు బూనినట్లు చూపులు చూస్తూ నిట్లనెను. ఓరీ! నీవు యెవడవు? నీవు రాయబారం నడుపవలెనా? వాడు యిక్కడకు వచ్చిన నేను సమాధానం చెప్పెదను నీ రాజు రాక్షసుడు. నేనెవరినైన నీ కెందుకు? నా ముందు నీ రాజు సైన్యము నిలబడినప్పుడు గదా

నీ రాజు బలము, నీ రాజు ప్రతాపం గన్పించును. నీవు నాకు సమాధానం చెప్పు దువా? నా ముందు నీవు నిలబడ గలవా? నన్ను యెందరెందరో వరింతుమని కోరి నారు నా కోరిక ఒకటున్నది దానిని తీర్చునవాడె నాకు వరుడగును. నీ రాజెంత? నీ వెంత? యిటు వంటి వారి నెందరను చూచినాను. ఆమె కసరుట గర్జించి నంతైనది.

వాడవంపడి వెంటనే వెనుకకు తిరిగెను. ఆ యదలింపుతో గుండెలు జారిపోయినవి. ప్రాణములు చేతబట్టుకొని పరుగున రాజు దగ్గరకు వచ్చెను. శరీర మంతయు చెమటలు పోసినవి. కాళ్ళువణకసాగెను. మహా భయముతో వాడిట్లు రాజుతో ననెను.

రాజా! అది రూపమునకు మాత్రం సుందరంగానున్నది. నిజంగా యొక మహా ఘాతముగాని మరొకటి కాదు. అది మాట్లాడిన యదరిపోవును. దాని కసరింపు మాటలకు చెమటలుతో శరీరం తడిసిపోయినది. శరీరంలో వణుకు పుట్టి నవి గుండెలు జారిపోయినవి. నేను నా బాధ యేమని చెప్పగలను? దేవతలు తయారు చేసిన మహా మాయావినిగాని యాడుదికాదు. చాలు చాలు ఎంతగర్వం? ఎంత భయంకర ధ్వని. ఆ సింగమరచినది. ప్రాణములరచేతిలో పట్టుకొన్నాను. మీరు మీ పొట్టుపడుడు దానిని మీరు సాధారణంగా తలచవద్దు దానిని కోరవద్ద నెను. రాజు విని వానితో నిట్లనెను, గుర్రము హరామీ చేసిన స్వారీ మాను కొందుమా? దానిని లొంగుబాటులోనికి గొనిరావలయును. స్వాధీనం కాని దానిని స్వాధీనపరచుకోవలయును. అది మగతనమని వానికి సమాధానం చెప్పి పంపి ముఖ్యమంత్రిని పిలచి యిట్లనెను.

నీవు చతురుపాయములాలోచించి దానిని స్వాధీనపరచి మనజనాలలో జేర్చుము. దానికి వలయునవన్నియు సమకూర్చెదమని రాయబారిగా ముఖ్య మంత్రిని పంపెను. అతడుపాయశాలి. నేర్పుగా మాట్లాడగలడు వానిని పంపగా రాజువద్ద శలవుగొని యాతడు తగునుపాయనములతో తగిన పరివారంతో బయలు దేరి యామె యున్న ప్రదేశమును జేరెను. వాని రాక ఇదివరులోనే గ్రహించిన మహాశక్తి చిరునవ్వు నవ్వుతు వాని నోరకంట చూస్తుండగా వాడు తన్ను సమీ పించి యా మంత్రి దేవి నుద్దేశించి ఇట్లనెను.

ఓ సౌందర్యదేవతా! నీవు యిక్కడ యొంటరిగావున్నావేమి? ఏమికోరి యిటకు విచ్చేసితివి. నీవు మా రాజ్యంనకే మంగళదేవతవు నీ వడుగుపెట్టి నప్పుడే మా రాజ్యం, మా రాజు శోభిల్లగలరు. కళ్యాణదేవతవగు నీవు యిట్లు యిక్కడ పడియుండుట తగని పని నీవు వచ్చిన రాజగృహముతేవా?

రాజు మర్యాదలందవా? మా రాజు మంచివాడు. మిమ్ముబోలు సౌందర్య వంతులెందరు వచ్చినను తృణీకరించును. నీ యదృష్టం పండిన వరించునేమో నీ యోగమాలోచించుకొనుము. నీకు యోగం మంచిదగుట చేతనే మా రాజ్యం జేరి నావనెను. అది విని యామె తలపంకిస్తూ ఓరీ! నీ నక్క వినయములు నేనెరుగు దును. నీ రాజ్యం నీ రాజు నాకెందులకు? ఎందరినో చూచినాను వారొక్కరు నా కోర్కె తీర్చలేకపోయిరి. నీ రాజుతీర్చునేమో యని వచ్చినాను. నీ రాజు నా కోర్కెనిట్లున్నదని చెప్పుము ఎవరు యుద్ధంలో నన్ను జయింతురో వారిని వరిం తును. ఇటువంటి యుప్పచప్పని కబుర్లతో పనిలేదు. మీ రాజును సైన్యసమేతంగా

వచ్చెను. యుద్ధభూమిలో నిలువమనుము. నన్ను జయించమనుము నేను స్వాధీన మగుదుననెను. నీవు యిచట నిల్చిన ప్రాణం దక్కదనెను.

వాడామె మాటలకు దద్దరిల్లిపోయి పరుగుమీద తన రాజును చేరి యిట్లనెను. మహారాజా! యామె సామాన్యురాలుగా తోచుటలేదు. నిన్ను యుద్ధమునకు పిలిచినది. తన్ను జయించిన నిన్ను వరించునట మీ రాజు బలము చూపించమనుము. నీ మాటలతో నేనానందించననెను. మీరువెంటనే రావలయునని యాతడు తొందర చేసెను. మహిషుడామెను చూడదలచి సైన్యముతో బయలు దేరెను. ఆతడు దేవి యున్న ప్రదేశమునకు దండెత్తి వచ్చుట చూచిన దేవి తన బలముతో నిమిషములో మహాశక్తి గణమును స్త్రీమూర్తులను తన ముందు నిల బెట్టెను. వారిలో మహాశక్తులున్నవి. వారందరా యుద్ధ ప్రదేశంలో నాయుధములు ధరించి యుద్ధ సన్నద్ధులైరి. మహిషుడు తన సైన్యముతో నెదుట నిలబడి ఇట్లనెను.

ఓ సుందరీ! నిన్ను మర్యాదగా స్త్రీవని దయదలచిచూస్తున్నాను. నీవు బాగ పరాలోచించుకొనుము సుందర శరీరమును బాణములపాలు చేసికొనకుము. నీ సుకుమారము నిలబెట్టుకొనుమని యెంతో చెప్పెను.

అది విని దేవి యిట్లనెను. నీవు నేను కోరిన రీతిగా నిలబడి నన్ను జయింపుము లేకున్న పొమ్ము యని గద్దించిపల్కెను. ఆమె వద్ద తన మాటలు సాగలేదు. దానితో తోచక తప్పని సరిగా యుద్ధములోనికి దిగెను. ఆ యుద్ధము ఘోరముగా జరిగెను. రాక్షస మాయలు రకరకములుగా పన్నసాగెను. అది చూచి దేవి తన బలముతో యుద్ధం చేయసాగెను. వారి మాయలకు ప్రతి మాయలు పన్ని తన శక్తులను వారి మీద దూకించెను. వారందరూ మహాయుద్ధములు గావించగా ముందుగా వాని మంత్రులు రాజును

వెనుకకు బెట్టి యుద్ధమునకు వచ్చిరి. వారందరు బలవంతులు మాయావులు. వారి మాయలు విడగొట్టి మహాశక్తులు విజృంభించినవి వారిని జయించుటకు తాను భయంకర రూపమును పెక్కు నామములతో సృజించినది అందు కాళీ రూపము, దుర్గా రూపం, శాకంబరి మొదలగు శక్తి రూపములు ధరించినది.

ఆమె దుర్గా రూపంతో శుభములిచ్చును శత్రువులకు స్వాధీనం కాకుండా భక్తులను రక్షించు మహా ప్రభావం. వెల్గించునది యైనది తన్నెదిరించిన యా మహిషాసుర మర్ధనీ రూపం యిది మహా శక్తియుతమై మహిషాసురమర్దనీ రూపమున సౌమ్యంగానుండు దేవి రూపం ఇట్టి దుర్గాదేవిని యెవరు రాహుపీడతో బాధపడుదురో వారారాధించిన రాహుగ్రహ దోషం నివారణమై బలవంతుడగు రాహువు గ్రహం చేయు పనులు కొనసాగించును ఇది దుర్గా విషయం యీ దుర్గా రాధనంతో సమస్త శుభములు గల్గునవెను.

ధర్మరాజు విని యీ రాహు పీడ యెవరైన యనుభవించి దుర్గా రాధనము చేసి ఫలితం పొందినారా? నాకు చెప్పమని కోరెను. వారు విని పరమా నందంగా నాతనితో రాహు పీడ శాంతించిన విధమునిట్లు వివరించెను.

పూర్వమింద్రున రాహుదోషం పట్టినది. శత్రుపీడ విశేషమైనది రాజ్య పదవి పోయినది. అరణ్యముల పాలైనాడు చెట్టునకొకరు పుట్టకొకరై పోవగా తను గురుడగు బృహస్పతిని పిలిచి గురుదేవా! నేను యీ రాజ్యభ్రష్ట స్థితిలో నున్నాను నాకే గ్రహం వ్యతిరేకముగా నున్నదని ప్రశ్నించెను. గురుడు త్రికాలవేదియు జ్యోతిషమందు ప్రజ్ఞానిధి యగుటచే లెక్కగట్టి రాహువు యీ సమయంలో వ్యతిరేకంగా నున్నాడు. ఆతని దోషం శాంతించుటకు దుర్గాదేవి

నుపాసించమని యా యంత్రం నిచ్చెను. ఆతడు పర్వత గుహాలో నుండి శుచిర్భూతుడై దుర్గా యంత్రం రాహు గ్రహపీడ తొలగుటకు నలుబది రోజులు విధి విహితంగా నారాధించెను దానితో దేవికి దయ కుదిరి వెంటనే ప్రత్యక్షమైనది. ఇంద్రుని చూచి యింద్రా! నీకు నా పూజాబలంతో రాహు గ్రహమున కధిష్టాన దేవతగా ఉందును. నీ గురుడుపదేశించినట్లు నన్ను గొల్చినావు గాన నేటినుండి నీ బాధలు తొలగును.

నేను నీతో ఉందును. నీవు యుద్ధభేరీ చాటించుము రాక్షసుల బలగ మును నేను సింహవాహన రూపంతో నుండి యదృశ్యంగా సంహరించి శత్రు విజయం చేకూర్చెదనని చెప్పి యదృశ్యమయ్యెను. దేవి యాజ్ఞానుసారంగా శత్రువుల మీదకు దండెత్తిపోయెను. వారి మాయలు బలం దేవి ముందు పని చేయలేదు. ఇంద్రుని వజ్రాయుధంతో తాను నిల్చి వారిని సంహరింపజేసెను. పిమ్మట దేవతలకు స్వర్గ రాజ్యం పట్టం గట్టెను నాటినుండి యాతడు దుర్గాదేవి నుపాసిస్తూ రాజ్యమును సుఖంగా పాలించసాగెను.

ధర్మరాజా! యీ గ్రహ దోషములు మనుష్యులకే కాక దేవతలకు కూడ పట్టును నీవు విచారం పొందవలదు దోషశాంతియైన పిదప మరల సుఖములనుభ వింతువని మునీంద్రులు రాహుగ్రహం గురించి చెప్పగా విని ఇంద్రునకు పట్టిన పీడ మనుష్యులకు పట్టదా! శాంతి సౌభాగ్యములకు దేవతా యుపాసనం ముఖ్య మన్నాడు.

## నవగ్రహ పూజా మహిమ

## 5 గురు గ్రహము

ధర్మరాజు తమ్ములతో భార్యద్రౌపదితో జూదమాడిన ఫలితంగా నరణ్య వాస దీక్షలో ఉన్నాడు. ఆతడు ధర్మస్వరూపుడు ఆడి తప్పనివాడు సర్వ ధర్మ ములు తన చర్యలలో చూపించు వాడగుటచే యా ధర్మ దేవతను కొలుచుటకు మహామునులు పెక్కుమంది యాతని చుట్టూచేరి కూర్చుండుటయు ననేక విషయ ములు గురించి చర్చించుటయు ధర్మములు పరిశీలించుటయు, వింత వింత విషయ ములు చెప్పుకొనుచు యుదిమిడి యున్న ధర్మ సూక్ష్మంలు గ్రహించుటయి జరు గుచూ ఉండెడిది. ఇట్లు వారు గోష్టులలో ఉండగా నొకనాడు ధర్మరాజునకు సందియం వచ్చినది. మున్ను ధౌమ్యులవారు బ్రాహ్మణాదులకు భోజన సదు పాయం చేయ సమర్ధత లేని సమయంలో సూర్యునుపాసించమన్నారు నేనుపాసిం చినాను. సువర్ణపాత్ర మందుండి యొక మహాదివ్య పురుషుడు వచ్చి నాకిచ్చి నాడు. సూర్యుడు గ్రహంగాని దేవత్వముండునా? యన్న యనుమానం తోడనే మిమ్ము యీ గ్రహముల విషయం ప్రస్తావించినాను. కొన్ని గ్రహములు వాటి యధిష్ఠాన దేవతలు చెప్పినారు.

ఇప్పుడు నాకైదవ గ్రహమని చెప్పబడు గురుని గురించి చెప్ప గోరె దను. అన్ని గ్రహముల కందరున్నారు యీ గ్రహమున కెవరధిష్ఠాన దేవతయో మీరు వివరించ గోరెదను యీ గ్రహం యే జాతిలోనిది? దీని బలమేమి? అది మంచిదైన యే శుభములు సమకూర్చును? చెడ్డదైన ఎట్టి దోషముత చేయును. ఎవరినారాధించిన యీ దోషంలు తగ్గును నాకు వివరంగా విన్పింపుడనెను.

వారు విని పరమానందమందుచు ధర్మరాజా! నీకు మేం సందేహములు తీర్చి వివరంగా గ్రహంను గురించి చెప్పెదము. నీవు గ్రహింపుము ఇవి యన్నియు జ్యోతిర్మండలములు ఇందున్న కాంతులు యీశ్వర తేజం సంబంధించి నదే!

పరమేశ్వరుడు తన స్థానంలో నితరులకగుపించకుండా యుండి తన తేజస్సును రకరకములగు రూపంలో నిల్పి సృష్టిని క్రమంగా సాగిస్తున్నాడు ధర్మరాజా! నీవు రాజ్యం పాలించిన ప్రభుడవు గద! అన్నిటికి రాజు వచ్చునా? రాజ ప్రతినిధులు నౌకర్లు. ఉద్యోగులు, మంత్రులు, సామంతులు, సైన్యం ఎట్లుండి రాజ్యం నడుపుదురో యట్లే దేవుని ప్రతినిధులుగా యీ భూమ్యాకాశములు, పంచ భూతములు, జ్యోతిర్మండలంలు, దేవగణములు యితర ముఖ్య ప్రాణులు యతని యాజ్ఞానువర్తులుగా నుందురు. ఆయనను యందరిలో నుండి సూక్ష్మ తేజమును నడుపుచుండెను. అందుచే గ్రహంలలో కూడ ప్రత్యేక రూపంతో నధిష్టాన దేవతగా ప్రకాశించును.

కాలం ననుసరించి వచ్చే విభాగంలో గ్రహముల కేర్పరచిన వశం ననుసంధానంగా పరిమితి నిర్ణయింప బడినది. ఆ పరిమితి కాలమా గ్రహం సంబంధించినదిగా తెలియవలయును. ఆ కాలంలో జరుగు శుభములు, సౌఖ్యంలు, పేరు, కీర్తి మొదలగు మంచి విషయములున్న దశమంచిదనియు చిక్కులతో, నష్టములతో, దరిద్రంతో, మరణములు, విరోధములు విక్రయాదులతో నడిచిన యా దశ చెడు దశయని చెప్పుదురు గదా! దశానాథుడగు గ్రహం ననుసరించి యనగా యాతని యునికినిబట్టి యున్న స్థానం, స్థానాధిపత్యం కారకత్వములు

చూచి బలాబలములు నిర్ణయించెదరు యీ గురు గ్రహముకూడ పెద్ద గ్రహమే!

ఇది బ్రాహ్మణ గ్రహం పదహారు సంవత్సరములు. దశాకాలం ఎక్కువ కాలం శుక్రునిది. యిరువదేండ్లు తరువాత శనిది పందొమ్మిదేండ్లు. తరువాత రాహువు పదునెన్మిదేండ్లు వాని తరువాత పెద్ద దశ పదహారు సంవత్సరములు గల్గిన గురుడు శుభగ్రహము. అతడు తగువుల మారికాడు.

వ్యాపారాదులకు కారకుడుగాదు. శృంగారము కాముకత్వమిచ్చు వాడున్నకాదు. గురుడు మంచివాడై శుభస్థానములందున్న వారికి సత్కాశత్రము నిచ్చును వేదశాస్త్రాది విద్యలలో ఘనునిగా చేయును. యజ్ఞయాగాదులు జరుపు నట్లు ప్రోత్సహించును. సద్గుణవంతులైన సంతానమునిచ్చును. ఆచార వ్యవహారాదులలో మంచి పట్టుదల గల్గించి సాగింపజేయును. వేద ధర్మముల నాచరణములో బెట్టి శుచిగా నిత్యముండ యత్నించును. మోసాదులు, పరద్రోహములు, యితరులను బాధించుటలు గిట్టని గ్రహము పదిమందికి విద్యగరపుచు గురుపీఠము నందుంచు శక్తిగలది యీ గురు దశ వచ్చినప్పుడు డగును. జాతకములో లగ్న, పంచమ, నవమ స్త రాజ్యములందున్న శుభాధిపత్యమున్నవాడైన మహామునీంద్రుల కోవలో నుంచగలడు.

గురుడు వ్యతిరేకముగానున్న శత్రుక్షేత్రమున, యెనిమిదింటను, మూడింటను, పండ్రెండవస్థానమందున్నను గురుడు దోషం చేయువాడగును. అనగా స్థానమును తప్పించుటయో, విక్రయించుటయో దురాచారముగా నుండుటయో, వ్యతిరేకించిన భార్యతో కాపురం చేయుటయో కూటికి కరువై పోవుటయో జరిపించును. ఎందరెందరో గొప్ప వారలకు కూడ యీ గురుని దోషముతో

నీచముగా నుండునట్లు, నీచప్రవర్తనలతో జీవితం సాగునట్లు దరిద్రం, భిక్ష జీవనం సత్రములందు సావడులందు పడియుండునట్లు చేయును.

అది విని ధర్మరాజు గురునకు కొన్ని మంచి గుణములు కొన్ని చెడ్డ వున్న జాతకుని యెట్లు నడపునని ప్రశ్నించెను. ధర్మరాజునకు ముని మండలిలో నున్న యొక పెద్దవాడు లేచి, నీ తమ్ములలో నొకరిద్దరు తప్పుగా నడచిన నీ వెట్లుందువనెను.

వారిని కూడ దీసికొని పరువు నిల్పచూడవా? యట్లే వాటిని కొనసాగ నీయకుండగనో వానిని కొనసాగనిచ్చుగ వెలితి కనుపించనీయకుండను తన శక్తి కొలది యత్నించును. గ్రహములలో ధర్మమువిధించు ఈ గ్రహం బలం గలవారు తరచు మునులలోను, విద్యావంతులలోను, విరాగులలోను, పుణ్య పురుషులలోను ధర్మముగా పరిపాలనం చేయు రాజులోను గన్పింతురు. ఓ రాజా! యీ బలం తక్కువైనదిగాదు. నిన్ను ధర్మదేవతగా చేసినది. వేదధర్మము లాచరింపజేయు చున్నది, యీ ముని మండలిలో నిలబడి చుక్కలలో చంద్రునివలె ప్రకాశింప జేయునదియు, నీ కున్న గురుగ్రహబలముగా నెరుగుము. ఈ గ్రహము వ్యతిరేక ముగా నున్నచో దానికి శాంతి విధానం వర్ణించి వివరింతుము వినుము.

గురుగ్రహం వ్యతిరేక స్థితిలో నున్నప్పుడా గ్రహమున కధిష్ఠానదేవత శంకరుడు, శంకరుని భక్తి శ్రద్ధలతో నారాధించిన గురుగ్రహ దోషములు నివా రింప బడునని యనగా విని వారి వలన యీ శాంతి నెరుగదలచి యిట్లనెను. మునులార శంకరు నారాధించిన గురుదోషం తగ్గునంటిరి. శంకరునకు యంత్ర మున్నదా? శంకర జపం యెట్లు చేయవలయును. శివుడెట్లు తద్దోషము తగ్గించునో

చెప్పుమని యడిగెను. వారు విని, యిట్లారంభించిరి ధర్మరాజా! శివారాధన క్రమము వినిపించెదము వినుము.

మేము చెప్పిన శాంతి క్రమమున వర్తించిన తద్దోషం తగ్గును. శుభ దినమున పంచాక్షర మంత్రంతో నొక యంత్రమును పొంది దానిని యిది వరలో చెప్పినట్లు పీఠమున నుంచి కలశస్థాపనం గావించవలెను. పూజాదుల యంత్రము నకు గావించవలయును. అభిషేకమునకు చమకాదులతో సాల గ్రామమునకుగాని శివలింగమునకు గాని గావించవలయును.

అది యొక విధానం. మరొక విధానముగా నొక పళ్ళెరములో యంత్ర ముంచి దానిపైన శివసంబంధమగు సాలగ్రామమో! పానుమట్టంతో నున్న చిన్న శివలింగమో యుంచి క్రమప్రకారం పూజాదులు గావించుతు సహస్ర నామము లతో పూజించుతు తీర్థప్రసాదములు గొనుచు నలుబది రోజులు దీక్షగా నుండి శివ మంత్రమును జపించినచో గురుదోష పరిహారమగును. యిది గురుదోష పరిహార విధానం. ఈ విధానమున నొక బ్రాహ్మణుడు కాశ్మీరదేశీయుడు తనకు గురుబలం తక్కువగానున్న కాలం వచ్చినదని గ్రహించెను. ఆతడు విద్యావంతుడు జ్యోతి ర్గణిత వేత్తయగుటచే సులభముగా లెక్కచూచుకొనెను. వెంటనే గంగాతీరము నకు వచ్చి యొకచో నివాసమేర్పరుచుకొనెను. ప్రతిదినం తనవద్ద నున్న సాల గ్రామమును శివ యంత్రముమీద నుంచి శివపంచాక్షరి జపం కొన్నిరోజులు జపించ సాగెను. ప్రతిదినం స్నానం, సంధ్య, జపం తీరిన పిదప శివ యంత్రముంచిన పళ్ళెరములో లింగము నుంచి వేదవిహితముగా నభిషేకాదులు గావించి తీర్థ ప్రసాదములు గొనుచుండెను.

యిట్లు దీక్షతో శివారాధనం గావించిన దీక్షానంతరం ధనాఢ్యుడు యొకడు వచ్చి యాతని దీక్షకు సంతసించి మీ వంటి పాత్రతగల వారిని పూజించవలయునని యా దంపతులకు దాన పట్టాగా భూమినిచ్చి పోషించెను. శివారాధన మాతడు జీవితాంతముచేసి గురుదోష విముక్తినొంది శివ కటాక్షమునకు పాత్రుడయ్యెనని గుర్వుగ్రహమును గురించి మహామునులు ధర్మరాజునకు వివరించిరి.

## నవగ్రహ పూజా మహిమ

## 6. శని గ్రహము

ధర్మరాజుతో మునీంద్రులు వనవాసములో నున్నప్పుడు చేరియున్న సమయంలో వారితో నిత్యం యనేక విషయములు ధర్మ విధులగు వారితో చర్చించుచుండువాడు. వారు పూర్వపు రాజుల కథలు, మహా మునీంద్రుల విషయములు, పరమేశ్వరుని లీలలు యితరములగు విధానములుగా నిత్యం గోష్ఠి జరుగుతున్న సమయములందు వచ్చిన విషయంలో జ్యోతిర్గణములు గ్రహములు దాటి ఇలా ఇలాలు చర్చించుచు వివరించసాగిరి. అందులో శనిగ్రముల వృత్తాంతం వివరణకు ప్రారంభించిరి. ధర్మరాజా! గ్రహంలలో చాలా సంవత్సరములు దశగల గ్రహములలో శని రెండవవాడు. ముందువాడు శుక్రుడు ఆతని దశ యిరువది యేండ్లు శని దశా సంవత్సరములు పందొమ్మిది సంవత్సరములు అటువంటి గ్రహం శని. శనిని గురించి పెక్కు విషయములు కథలు, గాథలు ప్రపంచమంతయు వ్యాపించియున్నవి. నీకా శనిని గురించి విపులంగా చెప్పెదము శనియను నామంతో ప్రజలందరు గడగడ లాడుదురు.

శని బలమున్నచో నాతడు చేయలేని యుపకారములేదు. ఆతడు తన దశలో బలవత్తరమగు స్థానములో నున్న వాడైన మహారాజుగా చేయును. పాపగ్రహముగా లెక్కగట్టెదరు. ఆతడు శుభాధిపత్యములు గల్గి వానికి బలవత్తరమగు స్థానములలో నున్నచో యెంత పనియైన చేయును. పాపగ్రహములకు పాప స్థానముల యందున్న బలము శుభ గ్రహములు కేంద్రములందున్న బలముకంటె గొప్పగా చూపింతును. అందుచే శని గనుక తృతీయ, షష్ట, అష్టమ, యేకాదశ స్థానములందుండి శుభాధిపత్యముతో, నున్న సమయములందు ప్రబలరాజయోగము చేయును. అసలు యీ శని యెవరు? ఎవరి తనయుడు వాని చరిత్ర వినిపింపుమని యా ధర్మజుడు కోరెను.

దానికి మునీంద్రులు విని రాజా! నీ కోర్కె తీర్చెదము ఈ వనవాసకాలములో నిన్ను సంతోషపరచుటకు వివిధకథా కాలక్షేపములతో మేము నీకు సాయముగా నుండి వినిపించి ప్రొద్దు పుచ్చెదము వినుమని యిట్లు ప్రారంభించిరి.

సూర్యునకు సంతానముగా యముడు, కాళింది, శని మొదలగు వారని చెప్పెదరు యముడు దక్షిణ దిశాధిపతిగా నుండి జీవులకు పాపదోష విముక్తి చేయుటకు కఠినములగు శిక్షలు వేయుచు తనకు కేటాయించిన యమలోకములో సంయమని నగరము రాజధానిగా చేసికొనియున్నాడు. కాళింది యను కన్యక యమునానదియై పవిత్ర ప్రభావముతో తన్ను పూజించిచిన వారిని రక్షించుచు పాపములు పోగొట్టి పుణ్యాత్ములుగా చేయు మహానదీ రూపములో గోచరించుచున్నది. ఇంక ఈ శని దేవుడు కంటికి కనిపించడు ఎవరికి గ్రహబలము తక్కువగా నున్నదో, యెవరు దురాచారములు

పాటించి తిరుగుచుందురో, యెవరు జూదము, దొంగతనము, దోపిడీ కృత్యములు చేయుచుందురో వారిని వెంటాడి వారు చేయు పనులకు సాయము చేయుచు దోషము గల్గించి వారు బాధపడునట్లు చేయును.

ఆతని దృష్టిపడినవారు నిర్భాగ్యులగుదురు. పీడలతో బాధపడెదరు. నానా హింసలకు పాలగుదురు ఆతను పట్టుకొన్నంతకాలము తిన తిండిగాని కట్టు గుడ్డగాని లేకుండా భ్రష్టులుగా చేయును. పాతవారైనను వాని ప్రభావమునకు లొంగవలసినదే! త్రిమూర్తులుగాని దేవేంద్ర దేవతలుగాని శని మహిమకులొంగి తిరుగవలసినదే! ఆతడు తలచుకొన్న యెంత యోగము చేయునో వ్యతిరేకమైన యంత భ్రష్టులను చేయును. సరియైన స్థానములనుండిన చక్కని విరాగము, తత్త్వ చింతనము, యోగనిష్ఠ, సన్యాసము గల్పించు యీర్వర తేజోదర్శనము చేయిం తును. దివ్యశక్తులు సంపాదించుటకు ప్రబలమగు శక్తి శని యొక్కడే యీయ గలడు మిగిలిన గ్రహములు యిచ్చినను యివి యింతగా విరాగము నీయజాలవు.

శని గ్రహము పాపగ్రహములతో చేరినప్పుడు తనను పాపాధిపత్యము వచ్చినప్పుడు యా మనుజుని భ్రష్ట సన్యాసము నిచ్చును. అనగా యింటికి దూరమై, భార్యాపుత్రుల కంటుకుండా కాషాయ వస్త్రములు ధరించి భిక్షాపాత్ర నిచ్చి జోలి యెత్తించును గుడులు, సత్రములు, యితరుల వీధిమరుగులు నివాస ములుగా చేయును.

ఈ జోలికట్టుకొని తిరుగు వారందరు శనిప్రభావితులే! రాజ్య మును చేజార్చి వనములకు జేరి కందమూలాదులు తినుచు మునులతో సహ వాసము చేయుటంతయు శని మహిమగా నెరుగుము మేము చెప్పిన విషయ ములో నీకు సందియములు గల్గవచ్చును. అవి యేవనగా నాకు శని ప్రభావ

ముందని యన్నారు. సన్యాంసము పుచ్చుకోలేదు రాజ్యసుఖములకన్న సుఖముగా నున్నాము దానికి కారణము యేమని యనుకొందువు. దాని కారణములు వినిపించెదము జాతకములో నవగ్రహములుండును గదా! అందులో నొక్కడు శని గదా! యింకా యెనిమిది గ్రహములున్నవి ఆ గ్రహములు కూడ కొన్ని గాని యన్నియుగాని చెడ్డయు మంచియు చేయునవిగా నున్నప్పుడు శనిప్రభావము పూర్తిగా పడనేరదు కర్మస్థానబలముతో సన్యాసమాదిగా ప్రతి ఫలించును దీనిని బట్టి నీవు పూర్ణము శని ప్రభావమునకు లొంగ లేదనియు రాజయోగ గ్రహములకా శని దృష్టి వలన యిటువంటిది వచ్చిన దనియు చెప్పవచ్చును.

లేకున్న యీరాచఠీవి, సోదరబలము, భార్యాదరణము. ధనుర్బాణ ధారణము యెట్లువచ్చును. శనియు, రాజ్యపూజ్య గ్రహముల కలయికతో నీకు వనవాసము వచ్చి యిట్లు యిక్కడున్నను రాజ్యభోగముల బల సంపదతో నుండ గల్గినాడవు. కర్మస్థానము ననుసరించి జీవుల వృత్తులు, కర్మలు, పూజ్యత్వములు యేర్పడును. శని శుభుడై కర్మస్థానములో నున్నను ,చూచినను, యితర గ్రహ దృష్టులు లేకున్న తప్పక దండక మండలములు ధరించువాడగును శని ప్రభావమును గురించి యింతగా నీ సందియములు తీర్చుచున్నామని వారన విని ధర్మ రాజు యిట్లు ప్రశ్నించెను.

మునీంద్రులార! మీరు చక్కగా విమర్శించినా సంబంధ గ్రహబలము చర్చించి చెప్పినారు సంతోషముగా నున్నది. ఈ శని ప్రభావము దేవతా కోటి పైన యెట్లు ప్రసరించినది? ఎవరినెట్లు బాధించినది? మరల నెట్లు మారినది? యవి యన్నియు మాకు విన్పింపుడని కోరెను.

## శని ప్రభావ వర్ణనము

అది విని యాతని ప్రభావము చూపిన కథలు పెక్కులు గలవు ముందు శంకరుడు, రావణాసురుడు, పురూరవ చక్రవర్తి మొదలగు వారందరూ శనికి లొంగిపోయినవారే! యన్నారు. ఆ మాటలు విని ధర్మరాజు శంకరుని కూడ శని బాధించ గల్గెనా? ఆ విషయము నాకు విన్పింపుడని కోరెను అప్పుడు మునీంద్రులు యిట్లా కథా ప్రారంభము చేసిరి. ఒకనాడు శంకరుడు కైలాసగిరి ప్రాంతములో నున్న వనములలో సంచారము చేయు చుండెను. ఆతడు ప్రమథగణములతో హాయిగా తిరుగుచున్న సమయమున శివునికి ప్రక్కనుంచి శని చల్లగా జారిపోవు చుండెను. ఆతడు తన్ను తప్పించుకొని తిరుగుచున్న శనిని చూచి పిలిచి యిట్లెను ఓ శనీ! నీవు గొప్పవాడవని యందురు నీ దృష్టి తగిలిన మాత్రమున మహా రాజు కూడ జోగికాగలడందురు నీ ప్రభావమంతటిదా? ఎందరనట్లు చేసినావు? నీవు చేయుదువని యందురు. నీ ప్రభావము నన్ను యేమైన చేయగలదా? ఏదీ నీ ప్రభావము నాపై చూపగలవా? యని యన్నాడు.

అది విని ముసిముసి నవ్వులు నవ్వుచూ దేవరవారి వద్ద నా ప్రభావ మేమి చూపగలను? తమరు నన్ను పిలిచి వినోదముగా చూడ దలచినారు. గాన మీకు సంతోషం గల్గునట్లు చూచెదను. నా ప్రభావం రుచి చూడవలెనన్న ఈనాటి నుండి వచ్చేవారమునాడు మరల మిమ్ము దర్శించెదను. దయ యుంచు డని చెప్పివెళ్ళిపోయెను ఆతని దృష్టి శంకరుని మీద పడినది గదా! ఆ సమయం నుండి శివునకు తన మనస్సులో సంశయములు ప్రారంభమైనవి. శని నన్ను

చూచెనా? వారమురోజులకు నన్ను చూతునన్నాడు ఈ వారమురోజులలో యేవో మార్పులు నాకు శని వలనవచ్చునని తోచుచున్నది. నేను తగు జాగ్రత్త తీసికొని యీ కాలమంతయు పవిత్రముగా నుందును.

అట్లున్న శని ప్రభావము నాకు తగులదని యోచించెను, దానికై యిప్పుడే జాగ్రత్త తీసికొనవలయును. యెట్లున్న వాని బాధ నుండి తప్పు కొందును. ఎందులకు వానితో నిట్లంటినని పదే పదే యోచనలు చేయసాగెను.

చివరకా శివున కొక యుపాయము తట్టినది. శని దృష్టి లోకమంతయు నిండియుండినను యెదుట పడిన వానికిగాని యీ దోషమంటదు కావున యొక చెట్టు తొర్రలో నణిగి యీ వారమురోజులుందును. ఆ గడువు దాటు వరకందులో నున్న శని చూపుపడదు. అదిగాక శని పవిత్రముగాని స్థలములలోన నాచారము లున్న ప్రదేశములందున శని ప్రవేశించును. ఆతడు రాకుండా పవిత్రమగు వస్తువును సేకరించవలెనుగదా! ప్రపంచములో పాపులను పుణ్యాత్ములుగా చేయునది గోవు. పంచగవ్యములు గోవునకు సంబంధించినవేగద! గోమయము పరిశుద్ధులను చేయును. నేనా గోమయమును చెట్టు తొర్రలో గోమయము మధ్యమున గూర్చుండి వారమురోజులు జరిపి బయటకు వత్తునని నిశ్చయించి యట్లే చేసెను. ఆతడా వారమురోజులు గోమయము మధ్యను చెట్టుతొర్రలో దాగియుండెను.

యిట్లు శివుడందుండిన తరువాత వారమురోజులు జరిగినవి. ఇంక శని పీడ వదలునని భావించి తల ముందుకు పెట్టి నలుదిశలు చూడసాగెను. ఆ సమయమునకే తాను చెప్పినట్లు శని యా ప్రదేశమునకు వచ్చెను. శివుడా శనిని చూచి యిట్లనెను. ఓ శనీ! యీ వారమురోజులలో నీ ప్రభావము నా మీద పడ

లేదు. నన్ను నీ ప్రభావమేమియు చేయలేకపోయినదని యెగతాళిగా నన్నాడు. ఆతడు నవ్వి నా ప్రభావమా నాడు నన్ను చూడగనే పడినది. అది మీకు తెలియదు. నాటి నుండియు మీరు చంచలముగా నుండలేదా? నా ప్రభావమెట్లు పడినదో వివరింతును వినుడు. తమరు ప్రమథ గణాధిపతులుగా గారా?

ఈనాడు మీ కైలాసము, ప్రమథగణము, పార్వతీదేవి, రాజభోగములు వదల్చినది నా ప్రభావముగాదా? శత్రుభయంకరులు త్రిలోకాధిపతులు భయపడి చెట్టుతొర్రలో దుర్వాసన గొట్టు గోమయములో గూర్చుండుట నా ప్రభావము గాదా? నా ప్రభావము యిట్లుండునని మీరు గ్రహించుటకు వారము వ్యవధి యిచ్చినానన్నాడు.

యిది యంతయు శని ప్రభావముగాదా? శంకరునే యిట్లు చేసిన వాడు యితరులను చేయలేడా? యని పల్కిరి. అది విని ధర్మరాజు శని ప్రభావము విశేషమైనదే! యింకా యెవరి మీద నిట్లు తన చూపు మళ్లించి నాడో నాకు విన్పింపుడని కోరెను. వారది విని ధర్మరాజా త్రేతాయుగములోనే శని బలను చూచిన వాడున్నాడు, వాని చరిత్రము చెప్పెదను ఆతడెవడో యను కొన్నావా? త్రిలోకకంటకుడైన రావణాసురుడని యెరుగుమన్నారు. అది విని రావణుని మీద కూడ తన దృష్టి మళ్లించి త్రిప్పలు పెట్టినాడా? యని యాశ్చర్య పడి యా విషయము వివరించగోరెద నన్నాడు. వారు ధర్మరాజునకు సంతోషము గల్గించుటకు నిట్లారంభించిరి. రావణుడు తనకు సహజ విరోధియగు ఇంద్రుని జయించి రాజ్యాధిపత్యము పొందెను. ఆతని కనుమాన మొకటి గల్గెను. తాను

న్నంతకాలము యింద్రుడు జయించలేడు. తన తదనంతరం మరలతన కుమారుల నోడించి రాజ్యాధికారము యింద్రుడు పొందునని యోచించెను.

దానికి ప్రతి క్రియగా యింద్రుని జయించగల శక్తివంతుడగు కుమారుని పొందదలచెను. బ్రహ్మదేవుని గురించి తపమాచరించగా బ్రహ్మయట్టి పుత్రుడుకల్గు గాక!యని దీవించెను.రావణుడు తన కుమారుడు పుట్టు సమయమునకు తాను యేర్ప రచిన రీతిగా గ్రహములను కట్టియుంచెను. ఎవరికి నియమించిన చోటులో వారిని కూర్చుండబెట్టెను. ఆయుఃకారకుడు శనిగ్రహమును పదకొండవ యింటిలో కూర్చుండ నియోగించెను. వారందరు వారి స్థానములు కదలరాదని కఠినంగా శాసించెను.

వారందరట్లే గ్రహకట్టు ప్రకారం కూర్చుండిరి. పైనుండి దేవతలు యీ యేర్పాటునకు భయపడసాగిరి. మనము యెట్లు యీ బాధ తప్పించుకొందుము. వీనితోడనే నానా బాధలుగా నుండ ముందు పుట్టువాడెంత దుర్మార్గుడగునో! దీనికి ప్రతిక్రియ యేమాయని వారందరూ యోచించసాగిరి.

## శనికి మందగతి వచ్చుట

దానిని గురించి దేవతలు పెక్కు విధముల యోచించి యుపాయాంతర మున కాలోచించగా నొక బుద్ధిమంతుడిట్లు చెప్పెను. మీ కెందులకు సందేహము? ఆయుర్దాయకారకుడు శని గదా! ఆయన చల్లగా చూచిన ఈ పని యెంతగును? రావణుడు కాదు గదా బ్రహ్మదేవుడైనను త్రిప్పలేడు మనమాయనను సంజ్ఞ పూర్వకముగా నాశ్రయించవలయును. ఆయన యుపాయముతో మనకుపకారము చేయగలడు దీనికి విచారించ పనిలేదనిసలహా చెప్పెను. వారందరౌననిరి. గగన

మార్గమున వారదృశ్యులై రావణుడు తొందరలోనున్న సమయంలో వారు శని నాశ్రయించిరి ఆతడు దేవకార్యమును చక్కబెట్టుటకు సందియ పడలేదు. నేనుప కారముగా వర్తించెదను మీ దారిన పొండని సాగనంపెను. తరువాత రావణుడు నవగ్రహములను వారి కుచ్చ స్థానములలో నిల్పెను. శనిని యేకాదశమందుచ్చ భాగములలో కూర్చుండజేసెను. ఆతనికి దేవకార్యము మాట మరుపులేదు.

సమయమునకై వేచి యుండెను. ఆ పుత్రుడు జన్మించు సమయం వచ్చినది వెంటనే శని పెద్ద యావులింత వచ్చినట్లరచెను. చేతులు వెనుకకు పోనిచ్చి యొడలు విరచెను. కాళ్ళు మునగబెట్టు కొనసాగదీయునట్లు కాళ్ళు యేకాదశము నుండి ద్వాదశమందుండుటచే నాతడు ద్వాదశమందుండు ఫలితము నిచ్చెను. అనగా మరణములేని జీవితముగల జీవిగా చేయదలచిన రావణుని కుమారునకు మితమగు నాయుర్దాయముగల వానిగా చేసెను. యిది చూచి కోపముతో పట్టరాని పగబూని "నా కుమారునల్పాయుష్కునిగా చేయుదువా? తుంటరీ" యని యా కాళ్ళు తనచేతిలో నాయుధముతో నరకెను.

తన కాళ్ళు నరకబడినది మొదలాతనికి మందగమనం వచ్చినది. నాటి నుండి యా శనికి మందుడని పేరు వచ్చినది. యిట్లు రావణుని సైతం తన ప్రభావ ముతో పడగొట్టగలైనని వారనిరి.

## పురూరవ చరిత్రము

ఇట్లు ధర్మరాజుతో మునీంద్రులు శని ప్రభావం శంకరుని మీద రావణుని మీద చూపిన చరిత్రము చెప్పి నన్ను సంతోషపెట్టినారు. ఇంకను శని యొక్క మహిమయు యెవరు వాని ప్రభావముతో బాధపడినారు వారిని గురించి నాకు మీరు విన్పించుడని కోరెను. వారు విని ధర్మరాజుతోనిట్లారంభించిరి. రాజా! పురూరవుడను రాజు శనిప్రభావముతో నానాబాధలు పడినాడు. ఆతడు వానిని వదలిన తరువాత మహాభోగములనుభవించి కీర్తిగడించి మహా చక్రవర్తుల కోవలో నిలబడగల్గెను. యని చెప్పగా విని ధర్మరాజు పురూరవుని కథ విన్పించుడని కోరెను. వారిట్లారంభించిరి. పూర్వము పురూరవుడను రాజు గలడు. ఆతడు ప్రజలను కన్నబిడ్డలవలె చూచుచు రాజ్యము పాలింస్తూండెను. ఆతడు వివాహ మాడి యనుకూలవతియగు భార్యతో కాపురం చేయుచుండెను. యిట్లాతడు రాజ్య పాలనం గావించు రోజులలో శని ప్రభావమాతని మీద పడినది. వానికి చెడ్డ రోజులు వచ్చినవి.

పురూరవుడు ప్రతిదినం బ్రాహ్మణారాధనము చేయుచు సంతోషముగా నుండు కాలములో నొక బ్రాహ్మణుడు రాజును సమీపించి యిట్లనెను. రాజా! నేను శని దేవుడను. నీవు యిన్నాళ్ళు నా దృష్టిలో పడలేదు. నేటికి మూడవనాడు నుండి నా ప్రభావమునకు లోనగుదువు జాగ్రత్త యని చెప్పి వెళ్ళిపోయెను రాజు యేమి చేయును. సరియే యని యూరకుండెను. మూడవనాడు వచ్చినది. దాయాదులతో మత్సరముపడి రాజ్యమంతయు నోడిపోయెను. కట్టుగుడ్డలతో భార్యతో నతడు రాజ్యము వదలెను.

ఇట్లు రాజ్యభ్రష్టుడై పురూరవుడు భార్యతో ప్రయాణమైపోయెను. ఆతడట్లు విడిచి పోగా కాలాంతరమున భార్యాభర్తలది చెరియొక దారియైనది. పురూరవుడు యొకముఠావారికి లెక్కలు కట్టువానిగా జీతగాడై సంచరించ సాగెను తరువాతపిల్లలదొక దారి భార్యదొక దారి రాజుదొక దారియయ్యెను.

ఆ పిల్లలను యొక గొల్లదాని రూపముతో పరదేవత రక్షించెను. రాజ పత్నిని యొక క్రూరుడు పరాభవము చేయచూడగా నొక పెట్టెలో దూరిపోయి నేను త్తమురాలనైనచో యీ పెట్టెనెవరు తీయలేరు నా భర్త తప్ప పర పురుషుడు నన్ను చూడలేడు తాకలేడని తనదీక్షలో యందుండిపోయెను. వాడు యెంత యత్నము చేసినను పెట్టె రాకపోవుటచే నాగ్రహము చెంది ప్రవాహములోనికి దానిని త్రోయించెను. ప్రవాహమునబడిన యా మందసము నొక చోటునకు జేరెను వారు దానిని కాపాడుచుండిరి. రాజు నానాబాధలు పడినాడు చివరకు కాళ్ళు నరకబడిన వాడయ్యెను. కుంటివాడై యాతడురణ్యములలో తిరుగాడు చుండెను. దేవీకటాక్షము రాజుమీద పడినది. ఆ రాజు తిండిలేక బాధపడుచుండ సమయమున దేవి యొక గొల్ల ముసలి వేషముతో వచ్చి రోజు రాజునకు భోజనము నందించి రక్షించుచుండెను.

ఆ దేశమును పాలించు రాజకుమార్తెకు స్వయంవరము నిర్ణయిం చిరి. పెక్కుమంది రాకుమారులకు శుభాహ్వానములు పంపిరి. ఈ పురూర వుడు కుంటివాడై గొల్ల ముసలిదానివలె నున్న దేవి పోషణములో నుండిన సమయములో నామె పురూరవుని చూచి యిట్లనెను. బిడ్డా! రాజకుమార్తెకు స్వయంవరము చాటించినారు నీవు కూడా వెళ్ళరాదా! రాజబిడ్డవని ప్రోత్సా

హించెను. ఆమె ప్రోత్సాహముతో కుంటివాడై కూడ దేవీప్రసాదముతో యదృశ్య సహాయముతో యా రాజ నగరమునకు పురూరవుడు చేరెను. అతడు కుంటివాడైనను రూపవిభవముల కందరకాశ్చర్యముగా నుండెను.

అతడొక ధనవంతునాశ్రయములో నుండెను. అనాటి రాత్రి మేడ మీద పరుండి చక్కగా గళమెత్తి దేవగంధర్వగానము చేయనారంభించెను. ఆ గానమును రాజ కన్యక విన్నది. అట్టి వాడెంతటి వాడోయని పొంగిపోయినది.

ఆ రాత్రి దేవి రాజకుమార్తెకు స్వప్నములో గనుపించి రాజకన్యకా! నీవు రాత్రి గానమాలకించిన వరునే వరించుము నీ కాతని వలన సర్వశుభములు గల్గునని యాదేశించినది. రాజపుత్రిక రాత్రి గానము వినిపించిన దెసవైపు చెలికత్తెలను బంపి పురూరవుని వృత్తాంతము తెలిసికొనెను. అతడు కుంటివాడనియు రాజకళ యుట్టి పడుచున్న వాడని చెప్పగా విని రాత్రి స్వప్నఫలముగా వానినే వరింతునని నిశ్చయించుకొనెను. కాని యాతనిని రాజసభకు బిలుచుట యెట్లు? వానిని వరించుటెట్లని యోచన బయలు దేరినది. అన్నిటికీ దేవి యున్నదని నమ్మి తండ్రిచేత నాహ్వానము పంపించెను కాళ్ళు లేకపోయినను యెట్లో స్వయంవరమునకాతడు వచ్చెను. వానినిచూచి యితర రాజకుమారులు హాస్యము చేయసాగిరి. ఓహో! స్వయం వరమునకు విచ్చేసిన యీ కుంటివాడు వరుడనగుదునని వచ్చినాడు. రాజు పుత్రికకు నచ్చునని నమ్మియున్నాడు చూతమని వారు చూచు చుండిరి.

రాజు పుత్రిక బారులు తీర్చియున్న రాజకుమారులను చూచినది తాను కోరినవరుడు కుంటివాడెక్కడున్నాడని వెదకి చూచినది. అతడొక మూలనాసనము మీద కూర్చుండెను. ముందు చేయదగిన విషయమాలోచించ

సాగెను. దేవీప్రార్థనము మనస్ఫూర్తిగా చేసినది. ఆమె ప్రార్థనమిట్లున్నది. తల్లీ! నా హృదయము నా కుంటి వానిపై నుండ జేసితివి. నేను స్వయంగా పూల హారము వేసిన వీరందరు వ్యతిరేకించెదరు ఎట్లు నేను యిందు నుండి దాటి యావరుని చేయిపట్టుకోగల్గెను.

దేవికి దయగల్గినది. మెఱుపువంటి యోచన గల్గించినది ఆమెకా యోచనములో పూలదండను సభా ముఖములో విసరి వేయుటయు దేవి యా దండ నా రాజపుత్రుని మెడలో పడునట్లు చేయుమని కోరెను.

## పురూరవుడు - శుభాంతము

రాజునకు కుమార్తెతన యభిప్రాయము నిట్లు తెల్పెను తండ్రీ! నాకు స్వయం వరము నేర్పాటు చేసినావు రాజకుమారులందరు వచ్చినారు వారి మధ్యకు పోయినిల్చుట యుత్తమ స్త్రీకి తగదు. నేను పూలమా లనుగొని సభలోనికి వచ్చి యా రాజపుత్రుల వైపు విసరెదను. అది యెవరి మెడలో బడిన యాతడే నా ప్రియుడు. ఇది నా నిశ్చయము నీవు సభా ముఖమున నాయుద్దేశము తెలుపు మన్నది. రాజంగీకరించెను. ఇట్లు జరుగునని వారికి చెప్పి సమ్మతింపజేసెను. రాజకుమార్తె సంతోషించి దివ్యాలంకారములతో నలంకరింపబడి సభలోనికి వచ్చి మనసార దేవిని ధ్యానించెను తల్లీ! అతడే నాకు భర్త యగుగాక! నే విసరిన యా దండ నా కోరిన వరుని కంఠ సీమలో బడుగాక! యిందులో నీవు తోడ్పడు మని పెక్కు విధముల ధ్యానించినది. ఆమెకు దయ కుదిరినది. తన భక్తురాలి కోరిక మన్నించదలచినది.

స్వయం వరమునకు వచ్చిన రాజపుత్రులకు సదాచార ప్రకారము నమస్కారము లర్పించెను. దేవిని ధ్యానించెను పూలమాలను విసరెను. సరిగా నా మాల పురూవుని కంఠమున బడెను ఆతడే నా ప్రియ భర్తయని సమ్మతించెను రాజు పరమ సంతోషముతో పురూరవునకిచ్చి వివాహము గావించెను. తన కుమార్తెను యెక్కడకు పంపవలయును. యను సందేహముతో రాజాగుచుండెను దేవీ ప్రసాదము వారి మీద గురియుటచే నడవిలో నొక రాజ సౌధమును తయారుచేసి సిద్ధపరచెను ఆతడు తన భార్యతో నరణ్యమునకు బోయి యా సౌధములో కాపురము చేయుచుండెను.

దేవి వారినొక దేవతా పురుషులవలె చిత్రించెను వారికి నిత్యభోజనము తానందించుచుండెను. ఇట్లుండగా చుట్టు ప్రక్కలవారు దివ్యదంపతులిచట నున్నారని దర్శించు నుపాయనము లందించసాగిరి.

వారు దేవీకటాక్షముతో నిలుబడ గల్గిరి. పురూరవునకు శని తొలగిపోవు రోజులు వచ్చినవి. ఆతడు రాజునకు బ్రాహ్మణరూపములో వచ్చి యిట్లనెను పురూరవా! నేను తప్పుకొను చున్నాను. నీ రాజ్యము నీకు దక్కును నీవు నీ యిద్దరు భార్యలతో సుఖముగా జీవించి కీర్తి గడించగలవు ఇన్నాళ్ళు నా మహిమచే యీ బాధలన్నియు పొందినావని చెప్పివెళ్ళిపోయెను వింతగా నున్న మందసము యెవరికి రాకుండుటయు రాజదంపతులు తమ యల్లుని కూతురిని గురించి తెలుసుకొనుట బయలుదేరిరి. దివ్యదంపతులనబడు దేవీ కటాక్షమున కాళ్ళు గల్గిన రాజై పురూరవుడుండెను ఆ మందసమును పురూరవుని చేయి తగులగా మూత విడినది. అందుండి యాతని భార్య యీ వలకు వచ్చినది. వారందరూ

చివరకు కలిసి సుఖించిరని శని ప్రభావముతో బాధలు పడిన పురూరవుని చరిత్రమును ధర్మరాజునకు చెప్పిరి.

ధర్మరాజు విని మహనీయులార! మీ వలన శని ప్రభావము వింటిని. అటువంటి శనిని వదలించుకొనుటకుపాయమున్నచో చెప్పగోరెదనని వేడెను. అది విని వారు రాజా! నీవు బృహదశ్వుని వలన నల మహారాజ చరిత్రము వినలేదా? నలునిస్మరించిన కలిదోషములుండవు శనిపీడలు గలుగ నేరవు. ప్రపంచమంతయు శనిచే పీడింప బడుచుందురు దానివలన యెన్ని బాధలు వచ్చునో యెంత బాధపడవలయునో తెలియరాదు సుమా! యిది మహా చిత్రమగు విషయమన్నారు.

ధర్మరాజా! నీవు యిదివరలో వింటివి కదా! నలమహారాజ చరిత్రము శని పట్టుకొనగానేమిచేసినాడు దాయాదులతో జూదమాడించినాడు రాజ్యమును పోగొట్టినాడు అడవుల పాలుచేసినాడు. ఆకలి బాధకు సహించలేకపోయి పిట్టలను బట్టుకొనుటకు పైన బట్ట విసరగా పక్షులెత్తుకొని పోయినవి నిద్రలో నున్న భార్య చీరకొంగు చింపుకొని భార్యను వదలి వెళ్ళిపోయెను దారిలో మంటలకు చిక్కుకొన్న కర్కోటకుని రక్షించెను. అతడు కాటువేసి రూపము మార్చివేసెను.

అడవులలో బడిదారి లేక ఋతుపర్ణుని వద్ద వంటలవాడుగా నుండిపోలేదా? నలుని భార్య దమయంతి నానా కష్టములుపడి పుట్టినిల్లు జేరుకొన్నది గదా! తన భర్తకై యెన్నిపాట్లుపడినది. బ్రాహ్మణులను పంపినానా దేశములు వెదకించి చివరకు నలుని వారి వలన నెరిగి వానిని తెప్పించుటకు ద్వితీయ స్వయంవరమని చాటించునట్లు ఋతుపర్ణునకు మాత్రమే శుభలేఖ

పంపగా నాతడు నలుని బహుకుడను పేరుతో వంటలవాడుగా నున్న యాత నిని సారథిగా గొని దమయంతియున్న ప్రదేశము చేరగా స్వయం వరములేదు. యేమియులేదని ఋతుపర్ణుడనగా దమయంతి తండ్రి యున్న విషయము వివరించెను. నలుడు కర్కోటకుని తలచి నిజరూపమంది భార్యాపుత్రులతో గూడి తన రాజ్యము దాయాదుల నుండి పొంది సుఖించెను నలునప్పుడు శనిపీడచే యిక్కట్లు వచ్చినవని యెరుగమని చెప్పిరి.

## శనిపీడా నివారణ విధి

అది యంతయువిని ధర్మరాజు శని దోషము పోవుటకు శాంతివిధానము చెప్పమని కోరెను వారు విని యిట్లనిరి ధర్మరాజా! శని పీడకు తైలాభిషేకము తిలదానము చెప్పబడినవి. శనిపీడపట్టినవారు నలుబదిరోజులు విడవకుండా తైలాభిషేకము విధివిధానముగా గావించుచు తిలదానములు యధాశక్తితో చేసిన దోష నివారణమగునని ధర్మరాజుతో శని వృత్తాంతము చెప్పిరి.

నవగ్రహ పూజా మహిమ

## 7. బుధ గ్రహము

ధర్మరాజు తనతో నున్న మునీంద్రులను చూచి "మహర్షులారా! మీరు! నావి యెన్నో విషయములు చెప్పినారు మీబోధలతో నామనస్సుపరమానంద మందుచున్నది. సర్వనియంతయగు పరమేశుని దయతో జీవులు కాలమును పరిగణించి యందు విభాగములలో నెవ్వరెవ్వరు యే దశలననుభ

వింపజేయుదురో వారి వారి ప్రభావములు కొన్నిటిని చెప్పినారు. యిప్పుడు నవ గ్రహబలము, వారి దశలలో చేయు నుపకారములు వ్యత్యాసముగా నున్న వేళల యందు యా గ్రహములు చేయు దోషములు చక్కగా వివరిస్తున్నారు. యిది విని జ్యోతిర్మండలములలో నున్న గ్రహములలో మిగిలిన వాటిని గురించి చెప్పగోరె దను. వాటి ప్రభావము వాటి దోషములు యెట్లు గన్పించునో చెప్పగోరెదననెను. వారు విని యిట్లారంభించిరి.

ధర్మరాజా! నీకు యిదివరలో నారు గ్రహములను గురించి చెప్పెదము. వినుమని యొక మహాముని యిట్లారంభించెను. బుధగ్రహము గ్రహములలో సౌమ్య గ్రహముగా నెరుగుము. అది చాల యోగ ప్రదముగా మంచిచోట నున్న ప్రతి ఫలించును. బుధుడు వైశ్యగ్రహమందురు. బుధుని బలము చాల గొప్పది. వ్యవ హార జ్ఞానమునిచ్చును. మంత్ర శాస్త్రబలము నిచ్చును. గణితశాస్త్రమునందు ప్రతిభ గల్పించి, పరుల యుద్దేశములు గ్రహించి నడుపగల సామర్థ్యమిచ్చును. సాహిత్య జ్ఞానము సదాచార ధర్మములు యుక్తి యుక్తముగా సాగింపజేయును.

రాజకీయ జ్ఞానముతో నేర్పుగా ముడిపెట్టి జాతకునకు యిరుకులోచిక్కు పడకుండా గెంటి వేయింతును. సభాముఖములో మంచి రుచిగా సంభాషింప జేయును. మంచిస్థానములలో నీ గ్రహము యోగ ప్రదముగానుండునని యెరు గుము. బుధుని విషయము నీకు వివరముగా చెప్పెదమాలకింపుము.

తన స్వక్షేత్రములందుగాని, మిత్రక్షేత్రములందుగాని యుచ్ఛ యందుగాని కేంద్రములందుగాని లాభములందుగాని బలయుతుడై బలవద్గ్రహ ములతోనున్నను, బలవంతుల క్షేత్రములలోనున్నప్పుడుగాని యాతడు చేయ

లేని యుపకారముండదు. అట్టి బుధుడు దోషకారియైనను, దోషస్థానములందుండి నను, శత్రుక్షేత్రములందుగాని నీచక్షేత్రములందుగాని యున్నచో చేయరాని యుపకారములు చేయగలడు. మిధునరాశి స్వక్షేత్రము కన్యారాశి స్వక్షేత్రమై యుచ్చస్థానముగా చెప్పబడినదని యెరుగుము ఈ బుధుని జన్మ వృత్తాంతము చిత్రమైనది. యితడు యిద్దరు పురుషులకు జన్మించినవాడు నీకు వీని జీవితచరిత్రము విన్పించి తరువాత యీ గ్రహమునకు దోషశాంతులు చెప్పెదమని యిట్లారంభించిరి.

పూర్వకాలమందు పార్వతి చెలికత్తెలతో విహారములు సేయుచు నొక దివ్యసరోవరముగల యరణ్య ప్రాంతమునకు వచ్చెను, యచట జలక్రీడలు జరుపుచు కొంతకాలముండెడివారు. అప్పుడు వారు వస్త్రహీనులై జలక్రీడలు సలుపుచు కాలము చక్కగా గడుపుచుండిరి. ఒకానొక సమయమున యిట్లు వివస్త్రులై స్నానములు చేస్తూ జలక్రీడలాడుచుండగా నెవరు పురుషులురారను నమ్మకముతో నున్న వారలకు పురుషమూర్తియటకు వచ్చెను. ఆతడు వారి విషయ మెరుగక వచ్చిన సంగతి పార్వతి చూచినది నారహస్య క్రీడాస్థలమునకు పురుషుడు వచ్చిన లజ్జగదా? యని కోపగించినది.

## పార్వతి వనము - రాజు ప్రవేశము

ఒకనాటి కాలమందు యిళుడను రాజు వేటకు బయలుదేరెను. ఆతడా వనము నందు స్వేచ్ఛగా వేటలాడుచు మిట్ట మధ్యాహ్నమునకు

మిక్కిలి దాహము చెందినవాడై పార్వతీశాపమున్న వనములో ప్రవేశించెను. ఆతడు ప్రవేశించగానే పురుషుడుగా నున్న రాజు స్త్రీ రూపముగా మారెను. ఆతడు సైన్యమంతయు స్త్రీలై పోయిరి. రాజు తన రూపము చూచి సిగ్గుపడి యడవులలో తిరుగుచు రాజ్యమునకు పోకుండెను. యిట్లాతడు రూపము ధరించి రాజు రాకపోవుటచే ప్రజలందరు చాల విచారముతో నుండిరి. ఆ రాజు తన స్థితికి విచారమందుచు చెలికత్తెలుగా మారిన సైన్యముతో నందందు తిరుగు చుండెను. ఒకనాడు దైవయోగమున చంద్రుడా వనమునకు దేవసేవ నిమిత్తము వచ్చినాడు వన విషయమగు శాపము నెరిగి బయట నుండి స్తవము లాచరించు సమయములో స్త్రీ రూపుడగు రాజు చూచి మోహపడెను. ఆమె రూపమున కాతడాశపడి యామెతో పొత్తుగలిపెను. అప్పుడు సద్యోగర్భము రాగా యీ రాజునకుచంద్రుని వలన యీ బుధుడు జన్మించెను.

రాజు తన స్త్రీ రూపముతో తిరుగుచు శంకరుని సేవించుచుండెను. శివుడా భక్తిని భక్తికానందపడి దర్శనమిచ్చెను. తనకు ప్రత్యక్షమైన శివునిచూచి పరమానందమంది యిట్లు ప్రార్థించెను. శివా! నీవు ప్రేమమూర్తివి. భక్తవత్సలుడవు. నిన్నాశ్రయించినవారు ఘనులుగా మారగలరు నీ దయ గల్గిన సమకూరని పనిలేదు నేను దీనావస్థలోనున్నాను. నా యవస్థ గుర్తింపుము.

రాజునై శాపమెరుగక వచ్చిన నాకు స్త్రీ రూపము ప్రాప్తించినది. దీనిలో నెవరిని చూడలేను. లజ్జాకరమగు జీవితము యెంత కాలము గడుపుదును.

నాకీ బాధ నుండి విముక్తి గల్గింపవా! యని దీనముగా వేడుకొనెను. శంకరుడు దయగల్గి పార్వతిని చూచి దేవీ! యీ భక్తుని పట్ల దయ

జూపి యీ శాపము మళ్ళించుము నీవు ఇచ్చిన శాపమునీవే త్రిప్పవలయును. దయదలచి వీనినుద్ధరించుమని తన దేవితో చెప్పెను. ఆమె విని నా శాపము మళ్ళించుట కుదరదు. అందులోనేదియో యొక మలుపు త్రిప్పెదను. నీవు చెప్పిన కారణంవలననే నొక సదుపాయము చేయుదును. ఈతడు రాజ్యమునకు పోవచ్చును. ఈ రూపముతో నొక నెలయు, యొక నెల పురుష రూపముతో నుండ గలడు. పురుష రూపముతో నుండిన నెలరోజులు రాజకీయములు సరిదిద్దుకొనుచు రాజ్యము పాలించుకొనుమని సదుపాయము భర్తకు చెప్పగా మంచిదని వారిద్దరు యోచించి రాజునకు శాపమును మళ్ళించిరి.

రాజు దానితో సంతోషపడి తన సైన్యముతో పురుష రూపముతో రాజధాని ప్రవేశించి రాజ్యమేలు చుండెను. అట్టి యిళుడను వానికి చంద్రునకు యీ బుధుడు జన్మించెను. నవగ్రహములలో నొకటగు చంద్రుని వలన జన్మించు టచే యీ బుధుడు కూడ గ్రహముగా మారెను. ఇది బుధుని పూర్వజన్మ వృత్తాంతము మేమిది వరులో నీకు చెప్పినట్లు యిద్దరు పురుషులకు కుమారుడీ బుధుడు ఈతడు గ్రహముఖ్యుడుగా మారెను. యింకను నీకు ఈ బుధ దోషము తగ్గించుకొన్న చరిత్రము విన్పింతుము.

బుధుడు వ్యయములోగాని యెనిమిదింటగాని శత్రుక్షేత్రముగాని యున్న నీ పరిమిత దోషము చేయును. యీతడు దుష్టాధిపత్యము పొందినను దోషము చేయును.

## బుధగ్రహ దోష శాంతి

దానిని గురించి యిప్పుడే కథ విన్పించుచున్నాము వినుమనిరి. పూర్వము ద్రవిడదేశమున చంద్రవత్తుదను వర్తకుడుండెను. అతడు గొప్ప

వ్యాపారము చేయుచు సముద్రప్రయాణమున నోడలు సంపాదించి దూరదేశములలో వర్తకం ఘనము గావించెను. అతని కనుకూల వతియగు భార్య యున్నది. ఆమె యందనురాగంతో నాతడు సంచరించుచుండెను. ఒకానొక సమయమున చంద్రదత్తుడు దూరదేశమునకై బయలుదేరదలచి తన యిల్లాలితో తన ప్రయాణం గురించి చెప్పెను. ఆమె యాప్రయాణమున కంగీకరించలేదు. ధనమందు వాంఛగల చంద్రదత్తుడు కొలదికాలములో వత్తును. ధనం ప్రధానం జీవితమునకని యెరుగవా? ధనం సంపాదించి భోగములను భవించుమని నీతి విధులందురు. విశేష ధనముతో మళ్ళీ వత్తునని ప్రయాణమైపోయెను.

ఆమె భర్తను వదలలేక వదలలేక వదలెను. ఆమె యింటియందు భర్త రాకకై యెదురు చూడసాగినది. ఇట్లుండగా కొంతకాలం జరిగినది. సముద్రములో నొకతుఫాను వచ్చినది. చంద్రదత్తుడున్న నావ తుఫాను తాకిడికి కొట్టబడి యొక కొండను ఢీకొనెను నావ యాదెబ్బకు నష్టపడినది. చంద్రదత్తుడొక దెసకు వాని పరిచారమొక దెసకు కొట్టుకొనిపోయిరి. అతడను తెలియకుండా కొట్టుకొని పోవుచుండ యింకొక దేశపు నావయాతని చూచి యందున్న వారు వానిని స్మారక మెరుగని వానిని తమతో గొనిపోయిరి.

ఆతడు తెలివి వచ్చినప్పుడు వారినావ యందుండెనుగదా! ఆతడు కొంచెం కొంచెం తెలివిపొంది తన విషయమడిగెను. వారు తమతో వానిని వారి దేశము గొనిపోయిరి. యీ విషయము యెవరికినీ తెలియదుగదా! భార్యకు నావ తుఫాను దెబ్బకు దారి తెలియక దెబ్బతిన్నదన్నియు చంద్రదత్తుని జాడ తెలియదని యితర నావవారు చెప్పిరి. అది విని యామెశోకించి బాధపడుచుండెను. తన

పట్టణములోని జ్యోతిష్కుని బిలిచి భర్త విషయం ప్రశ్నించినది. అతడు గుణించి యిప్పుడు నీకు నీచ బుధుడున్నాడు. కొద్ది రోజులకనగా మాసముల లెక్కకు తొలిగిపోవును. బుధదోష శాంతి గావించుకొనుము. నీ భర్త నిన్ను చేరగలడని చెప్పెను. ఆ మాటలు విని యా దోష శాంతి విధానమడిగెను. వెండితో గాని రాగితో గాని శ్రీహరి విగ్రహము చేయించి నలుబదిరోజులు ద్వాదశాక్షరి మంత్ర జపము గావించి పూజలు గావించిన వ్యయమందున్న బుధుని దోషము శాంతించు నని చెప్పెను. ఆయన మాట ప్రకారముగా దీక్షబూని జపం బుధగ్రహ దోష శాంతికి చేయించెను. సరిగా దీక్ష సమాప్తము రోజునకు చంద్రదత్తుడు తన్ను కాపాడిన నావ యజమానితో ధనంతో కొత్త నావంతోయీ శాంతి బలంతో నింటికి వచ్చెను. దంపతులు యీ బుధగ్రహదోషము, దాని శాంతి శాస్త్రజ్ఞుని సలహా చెప్పినది విని దాని నాచరించిన కారణమున బాధలు తగ్గి సుఖంగానుండిరి. యిది బుధగ్రహదోష నివారణ కథ యని చెప్పగా ధర్మజుడు విని పరమానందమందెను.

## నవగ్రహ పూజా మహిమ

## 8 కేతు గ్రహము

మహామునులతో నానా విధములకు గోష్టులు చేయుచు కాలము, కాల విభాగములు, జ్యోతిర్గణములు, గ్రహములు, రాశులు వాటివాటి వివరములన్నియు ప్రశ్నించుతు వినుచు పరమానందమందుచు బుధగ్రహ విషయం విన్న తరువాత గ్రహం కేతువుగదా! ఆ కేతువును గురించి దాని బాధలు గురించి, మంచి చేయు బలములను గురించి సాంతముగా వినగోరి ఇట్లనెను. మునీంద్రులార! నా యందు దయయుంచి యింతగా సమస్తము చెప్పుచున్నారు. రాహుకేతువులు గ్రహములా? యవి ఒకటనియు రాక్షసుడనియు కొందరందురు. వాటి చరిత్రము వినిపించి నాకు తృప్తి గల్గజేయుదని కోరెను. వారు ధర్మరాజు కోరికను మన్నించి యిట్లు ప్రారంభించిరి. యిదివరలో జగన్మోహినీ రూపము శ్రీహరి ధరించెనని విని యున్నావు గదా! దాని విషయము మేము చెప్పుచున్నాము వినుము.

అమృతభాండము సంపాదింప దేవదానవులు క్షీరసాగరమును మథించినారు. అందులో వారికి లోపల భేదములున్నను యా పనిలో నందరు యొకటై యత్నించిరి. యిట్లు యత్నించిన తరువాత మంధరగిరి తరువగా నందుండి యెన్నియో జన్మించినవి. చివరకు ధన్వంతరి యమృత కలశ

ముతో నుద్భవించెను. ఆతడు పుట్టుట తరవాయిగా రాక్షసులు యా కలశమును బలాత్కారముగా లాగికొనిరి. వారల మృతమును త్రాగుటకు సిద్ధముగా నుండిరి. దేవతలుచూచి కంగారుపడి యిట్లనుకొనిరి. మనమంత యత్నము చేసి యెవరు బాధ చెందకుండా యుండవలయుననుకొన్నామో యా రాక్షసులకే యది చిక్కినది.

మనమేమి చేయుదము? వారు బలవంతులైనచో మనకు మనుగడ కష్టమగును. వారిని జయించలేము. మనకాపదలలో కనపడు ప్రభువు శ్రీనివాసుడు తప్ప యెవరూలేరు. హేప్రభో! శ్రీహరీ! చీటిమాటికి మాకు శరణ్యమై మమ్మాదరించుచున్నావు.

## కేతు గ్రహ వృత్తాంతము

మాకెప్పుడు యీ శత్రుభాధతప్పుటలేదా యింత ప్రయత్నము చేసినా దయ సంపాదించుకొని యాతనలుదాటి యమృతము చివరకు చేజిక్కకుండా శత్రుపరమై పోయినది. మేము నిస్సహాయులమైయున్నాము. నీ వద్దు పడకున్న మేము కడగండ్ల పాలగుదుమని కన్నీరు గార్చుచు దేవ దేవుని ప్రార్థించసాగిరి. వారి మొర శ్రీహరి విన్నాడు. వారి కుపకారము చేయదలచినాడు. వెంటనే తన రూపము మార్చినాడు. జగన్మోహన రూపము దాల్చి సుందరీమణిగా తయార

య్యాడు. అక్కడకు ముందుగా రాలేదు. కొన్ని యోజనముల దూరముగా నుండి చక్కగా గళమెత్తి స్థాయి భేదములతో గానము గళమెత్తి పాడనారంభించెను. యిదివరలోనెన్నడెరుగని యా గానము దేవదానవుల నాకర్షించినది. ఎక్కడి వారక్కడనే యెట్లున్న వారట్లనే బొమ్మలవలె నుండి పోయారు. ఆ గానము వచ్చు దిక్కువైపు చూడసాగారు. దూరము నుండి మెల్ల మెల్లగా నడుగులు వేయుచు నొయ్యారము లొలకించుచు తన రూపము చూచి వారందరు మురిసి పోవునట్లు నటించుచు వచ్చుచుండెను.

వారట్లు వచ్చిన మోహినిదేవతను చూచి పరమానందంగా రాక్షసుల వైపు తన ప్రేమవర్షముకురిపించుచు లాలించుచు దేవతలను తిరస్కరించునట్లు నటించుచు వారి మధ్యకు వచ్చుచుండెను. ఆ వచ్చిన సుందరిని చూచి దేవతలు రాక్షసులు పొంగిపోవగా వారి మధ్యను నిలచి యా దేవి యిట్లనెను. మీరు మీలో కలతలు పడుచున్నారా? యెందులకిట్లున్నారన విని వారిట్లనిరి.

ఈ యమృతమును పంచుకొనుటలో మాకు తగాయిదాలు వచ్చినవి మధ్యవర్తిగా నీవు మాకు సమముగా పంచిపెట్టమనగా రాక్షసులు యెక్కువ నమ్మకముతో నమృతకలశమును జగన్మోహినిదేవి చేతికందించిరి. ఇట్లు తమకు లాభము కల్గజేయు సుందరి చూపులకులొంగి మారుమాటడలేక పోయిరి. ఆ మోహినిదేవతా కలశముగొని వారిమధ్యను నిలచి యిట్లనెను. మీరు గుంపుగా కూర్చున్న నేనమృతమెట్లు పంచగలను? ఎవరు యేవర్గము

వారో వారి వారివర్గములో వారు పంక్తులుదీర్చి కూర్చుండుడు. నేను వరుసగా వచ్చెదను. తొందర పడకుండని వారించెను. వారినట్లు కూర్చుండజేసి ముందు దేవతగణమున్న పంక్తి నుండి యమృతము పంపకమారంభించినది. వరుసగా దేవగణములకు నమృతము పంచి పెట్టగా రాక్షసులు చేయునది లేక విక్క మొగములు పెట్టి మోహినిదేవతను చూడసాగిరి. ఇట్లు దేవతలకు నమృతము పంచిపెట్టుటచూచి సహింపలేక రాక్షస పంక్తిలోనున్న యొక రాక్షసుడు దేవతా రూపము ధరించి కూర్చుండెను. అది శ్రీహరి గమనించక నమృతము పోసెను. ఆతని కపటము పైనుండి సూర్యచంద్రులు చూచి శ్రీహరికి సంజ్ఞ చేసిరి. అది గమనించి హరిచక్రమును పంపి వానిని ఖండించెను.

అతడమృతమును పానము చేసిన కారణమున మరణము లేకుండెను. ఆతడు హరిచక్రముచే ఖండింపబడుటచే శిరస్సు యొక భాగము మిగిలిన మొండెం మరొకభాగముగా నెగసిపోయిరి. వారట్లు పోయి గ్రహమండలములో స్థానము సంపాదించుకొని యిది వరకున్న యేడు గ్రహములలో కలసి తొమ్మిదిగా మారి పోయిరి. తలభాగము రాహువు యను పేరుతోను మొండెము కేతువు అను పేరు తోను పిలవబడుతున్నారు. వారిని శ్రీహరికి సంజ్ఞతో సూర్యాచంద్రులను వేధించు చుందురు. ధర్మరాజా! నీకు యీ సూర్యచంద్రుల శత్రువులగు వారి విషయము పూర్వగాద విన్పించితిమి.

జ్యోతిర్గణములలో నిల్చిన రాహువును గురించి చెప్పినాము యిపుడు యీ కేతువును గురించి చెప్పెదము వినుము.

జాతకములో కేతుగ్రహము పాపగ్రహముగాన యది యెంత మంచిచోట నున్న రకరకములుగా బాధించును. అతడు వ్యయమందుండిన యనగా పండ్రెండవ యింటి యందున్న పుణ్యప్రదములగు పనులు చేయింతును. స్వయం గావించి మోక్షమొసగును. యెందున్నను యదిగారడీ గ్రహము. దాని దశలోనను కొన్నది కాదు. కాదనుకొన్నది యగును. ఒక్కొక్కసారి చివరభాగము జీవులను స్థిరముగా నుండనీయదు. కుదురులేకుండా చేయును. దీనితో షష్టాష్టకము వచ్చిన పాపగ్రహమునకుగాని, పాపాధిపత్యముగల గ్రహమునకు పాపస్థానమందుండు గ్రహమునకుగాని దాని దశలో యేదో భాగములో బంధుమరణముగాని, మిత్ర మరణముగాని, లేదా యితర జీవులకు కర్మ కాండలు జరిపించుటగాని కన్పించును యాతడు వేదాంతము లేక విరాగం గల్గించి దేశాటనలు త్రిప్పుట, సన్యాసజీవనం గడుపుట మొదలగునవి యిచ్చును.

యీ గ్రహము దోషస్థానము నందుండినను దాని దశ వచ్చినను యది యితర గ్రహములను చూచినను మనస్సునకు స్థిమితముండనీయదు. సంచారము చేయించును. చాల చిక్కులు వృత్తులయందు గాని యుద్యమము లందుగాని కల్పించును. దీనికి శాంతి జరుపుకొన్నయది శమించును. ఆ శాంతి విధానము వినుము. సర్పాకారముతో నొక ప్రతిమను చేసి దానిని ఇది వరలోవలె మండల దీక్షతో నారాధించవలయును సుబ్రహ్మణ్య యంత్ర మారాధించవలెను.

ఈ యంత్రమును నలుబది రోజులు కేతుగ్రహ శాంతికి పూజించవలయును. జపము చేయవలయును. హోమము తర్పణము గావించవలయును. అట్లు చేసిన వారికి కేతుగ్రహ సంబంధ దోషము తగ్గునని మునీంద్రులు వివరించిరి.

## 9. శుక్ర గ్రహము

ధర్మరాజు మహామునులతో కాలక్షేపము చేయుచు వారి వలన దేవి రహస్యములు మంచి విషయాలు. తత్త్వబోధలు పూర్వపు మహారాజుల చరిత్రములు వినుచు నవగ్రహముల వృత్తాంతములు వినుచు వాటి దోషములు, వారి శాంతులు, వాటి కధిష్ఠాన దేవతలు వారి యారాధనక్రమములు వినుచు చివర గ్రహమగు శుక్రుని గురించి వినదలచి యిట్లనెను. మహనీయులార గ్రహములలో సమస్త సుఖములు అరువది నాల్గుకళలు, మహాభోగములు శుక్రగ్రహము వలన కల్గునందురు. ఆ గ్రహము మంచిదైనచో లాభములు వచ్చు. ఆతడు వ్యతిరేకముగా నున్న యేయే శుభమునలచ్చును. దానిని గురించి చెప్పుచు దోష యుక్తమగు శుక్ర గ్రహ పీడ తొలగుటకే దేవతా నారాధించవలయును. దాని కధిష్ఠాన దేవత యెవరు? నాకు సవిస్తరముగా నా గ్రహమును గురించి వివరింపుడని కోరెను.

వారు విని ధర్మరాజును చూచి యిట్లు చెప్పనారంభించిరి. ఓ ధర్మరాజా! నీకు శుక్రగ్రహమును గురించి నీవు కోరినట్లు వివరించెదము సావదానముగా వినుము గ్రహములలో శుక్రుడు గురు, శుక్ర శనులు పెద్ద గ్రహములు వాటి పరిమితి సంవత్సరములు కూడా చాలా గలవు. అందులో శుక్రుడు ఇరువది సంవత్సరములు దశలగలవాడు. ఆతడెంతవాడనుకొన్నావు. ఈ రాజ్యభోగము, కామినీ భోగములు సంతాన లాభమునిచ్చును. గుర్రము యేనుగులు, మేడలు, మిద్దెలు, భూములు, సర్వైశ్వర్యములు నిచ్చువాడు.

సర్వ కళలు శుక్ర ప్రసాదముతో వచ్చును. సంగీత సాహిత్యములు సమస్త కళలు యాతని దశలో ప్రాప్తించును. రాజ్యభోగములు సుఖలాభములిచ్చును. ఆతని దయతో పొందరాని సుఖములు లేవని చెప్పగా విని, యాతడు వ్యతిరేకుడైన యెట్లుండుననెను.

వారు విని మరల నిట్లనిరి. రాజా! శుక్రగ్రహము వ్యతిరేకముగా నున్న వారికి కల్గు నష్టము చెప్ప తరముగాదు. వారు సన్యాసమునకు దూరమై భ్రష్టులై పోవుదురు. భూ, గృహ, ధన, కళత్ర, పుత్రాదుల సుఖములకు దూరముగా జేయును. నానా విధములగు బాధలు పెట్టును. అందువలన శుక్ర గ్రహము దోషము పోగొట్టుకో వలయునన్న లక్ష్మీదేవి నారాధించ వలయును శుక్ర దోష సమయములో లక్ష్మియంత్రమును నలుబదిరోజులారాధించినచో యా పీడలు తొలగుననిరి. అది విని ధర్మరాజు శుక్రున కధిష్ఠాన

దేవత లక్ష్మీదేవియా? ఆమె వృత్తాంతము వినిపింపగోరెదను. యే చరిత్రము లైనను యీశ్వర విషయములు వినిన కొలది వినవలయునని యుండును గదా! నాకు చెవుల పండువుగా నా కథను విన్పింపుమని కోరెను. వారు ధర్మరాజు మాటవిని యిట్లు ప్రారంభించిరి. దేవదానవులు యెప్పుడు శత్రువులేగద! వారికి కల్గిన శత్రుత్వము తీర్చుకొనుటకు రాక్షసులు ఘోరమగు తపములు చేసి వరము లందసాగిరి. వారిబలము పెరుగుటచే దేవత లుపాయ మాలోచించసాగిరి.

దేవతలు రాక్షసుల బాధ తొలగుటకు బ్రహ్మదేవుని దర్శించిరి. ఆతని జేరి స్తవములు చేయగా విని దేవతలారా! మీరు కోరిన విషయము సందియము తీర్చుటకు సమర్థుడు శ్రీహరి తప్ప నింకొకరులేరు. మనమాయన నాశ్రయించి సలహా పొందదగునని వారిని వెంటబెట్టుకొని శ్రీహరి నివాసమునకు వెళ్ళిరి. నారాయణుని దర్శనము దుర్లభము గదా! పాల సముద్రములో నున్న హరిని యీవల తట్టు నుండి యనేక విధముల ప్రార్థించిరి.

వారి మొరలు విని శబ్దరూపముతో నిట్లు సమాధానముగా పల్కెను మీరు పాలసముద్రమును తరచినచో నమృతము వచ్చును. దానిని పుచ్చుకొన్న మరణము రాదు. బాధలేదు. కావున మీరా యత్నములో నుండుడు. నేను మీకు వెనుక సాయముగా నుందుననెను.

## దేవ దానవుల యత్నములు

వారు శ్రీహరికి నమస్కరించి వెనుదిరిగి వచ్చిరి. యిట్లు వచ్చి వారిట్లా లోచించిరి. మనము హృదయములందు విరోధములు నణచుకొని వారిని బిలచి యీ యత్నములో సాయపడుడని కోరుదము. వారిబలముతో క్షీరసాగరము మధింపగలమని యోచించి వారిని జేరి యిట్లనిరి. సోదరులార! మనము మన విరోధములు వదలి యన్యోన్యమును సంపాదించ వలయును. దానికి తగిన యత్నములు చేయవలయును. ఎట్లు పాలసముద్రమును మధించవలయును? దానికి తగు యత్నము యెట్లుచేయవలయును యని వారాలోచించిరి. దేవతలు మరలా బ్రహ్మదేవుని వద్దకుపోయి యీ సమస్య యెట్లుతీరును చెప్పుమని ప్రార్థించిరి. ఆతడు మరల శ్రీ హరినే యడిగి తెలుసుకొందమని వారితో శ్రీహరి సన్నిధికిపోయి ప్రార్థించి యిట్లనిరి. దేవా! తమరు క్షీర సముద్రము మధించిన వచ్చు నమృతమును స్వీకరించుమని శలవిచ్చినారు క్షీర సాగరము మధించుటకు సాధనమేమి?

దానికి కవ్వపుత్రాడుగా నెవరి నుపయోగించ వలయును? దానిని గురించి మాకు తెలియజేసి మా యను మానము తీర్చగోరెదమని ప్రార్థించిరి. అదివిని శ్రీహరి నవ్వి మీరు మంధరగిరిని తెచ్చి పాలసముద్రములో నుంచి మధించుడు. మీరు మధనమునకు త్రాడుగా వాసుకియను సర్పరాజు నుపయోగించుడు. యిట్లుచేసి మధించిన యమృతము వచ్చునని యదృశ్యుడయ్యెను వారంవరు విని పరమానందమందిరి. రాక్షసులకు యీ విషయము శ్రీహరి చెప్పినట్లు చెప్పక డొంకతిరుగుడుగా నిట్లనిరి.

సోదరులార! మన మంతయు పాలసముద్రమును తరువవలెను గదా! మనము దానిని తరుచుటకు మంధర పర్వతమును కవ్వముగా చేయవలయును. దానిని గొని వచ్చి క్షీర సముద్రములో పడవేయుదుము రమ్మని వారిని పిలిచిరి. దేవతలు రాక్షసులు కలిసి మహా ప్రయాసముతో మంధర గిరిని సమీపించిరి.

వారాగిరిరాజును యనేకవిధముల స్తవములు చేయుచు సమీపించి బాహువులతో లేవనెత్తిరి. పెటపెటలాడినది పర్వతము. కూకటితో లేవనెత్తుట దేవదానవులకు భారమైనది. మంధరపర్వతము క్రింద యొక పల్లము ప్రదేశమున్నది. అందులో విచిత్రమగు వర్ణములతో మెరయుచుండు నొక చిన్న తాబేలు పిల్ల నివసించుచున్నది. వారా తాబేలు పిల్లను చూచి పరమాశ్చర్యమందియుందులో యిది యెట్లున్నదన్న సందియము పుట్టినది వారు దాని వంక చూడసాగిరి. అది చిత్ర చిత్రముగా కదలికలు చూపసాగెను. మంధర పర్వతమును దొర్లించి దొర్లించి భుజముల కానించుచు యెట్లో సముద్రపు గట్టునకు తెచ్చిరి. అట్లు శ్రమమీదగొని వచ్చి దానిని విసురుగా నందులో త్రోసిరి. అది రబ్బరుంతివలె యందుబడి మున్గుచు తేలుచు దొర్లుచుండెను. వారు సముద్ర మధ్యములోపడి మున్కలువేయు గిరీంద్రము నేమి చేయగలరు? గట్టునుండి గ్రుడ్లువెల్లబెట్టి చూచుచుండిరి. దేవదానవులకుశక్యముగాని పనియైనది. చేయునది తోచుటలేదు. మరల శ్రీహరినే ప్రార్థించవలయుననుకొన్నారు దేవతలు.

వారు రాక్షసులకు తెలియకుండా శ్రీనివాసుని యిట్లు ధ్యానించిరి. జగదీశ్వరా! మా కాపత్సమయములందు నీవు తప్ప యెవరడ్డు పడుదుర

ఎవరికా సామర్థ్యముగలదు? దయయుంచి మాకు సాయపడుమని పలు విధముల ప్రార్థించిరి. వారిని దయదలచి నారాయణుడాకాశమున మెరుపువలె మెరసి యిట్లనెను దేవతలారా! నా మాట వినుడు మీకు మంధరగిరి స్వాధీనమగునా?

నేనా గిరీంద్రము క్రింద నుండి దానిని దొలచి మీరెత్తుకొనుట వీలు చేయలేదా? దాని క్రింద నున్న తాబేలుపిల్ల యెవరు? నేను గానా? నేనది యంతయుదొలచి మీకు సుఖముగా లేవనెత్త నేర్పాటు చేయలేదా? మీరందరు సాయము పట్టి యా తాబేలుపిల్లను మోసికొని వచ్చి సముద్రములో విడువుడు.

నేను భారముగా నుందును. నన్ను మీరు స్మరించి లేవనెత్తుడు నేనా సముద్రములోనికి ప్రవేశించి యా మంధరగిరిని మోయుదును. దానిని బట్టుకొని మీరు మదించుడు. వాసుకిని ప్రార్థించి కవ్వము త్రాడుగానుండగోరుడు యని సలహా చెప్పెను. వారా హరి మాట విని ముందుగాజేరి యా కమఠరాజు నన్వించిరి. సంతోషముతో చిన్న మూతిని నిగిడించి వారికి శుభా శీర్వాదములు గావించెను. తరువాత వారు రాక్షసులనుబిలిచి యీ తాబేలును మనము గొనిపోయి పాల సముద్రములో వదలుదము. అది మన పర్వతమును మోయగలదు. తరువాత వాసుకి సర్పరాజును ప్రార్థింతమనిరి. వారంగీ కరించగా యా మాయా కమఠమునుజేరి వారిచేతులు దాని క్రిందకుపోనీయగా నొక్కసారి గట్టిగా నొక్కెను. వారు చేతులూడ లాగలేకపోయిరి. అబ్బా! ఈ పిల్లతాబేలు యింత బలముగలదా? యెంత బరువుండునో యనుకొనిరి.

వారందరూ సాయపడి దాని నెత్తిపట్టగా రాక్షసులవైపు భారముగాను, దేవతలకు తేలికగాను కన్పించి యిది విచిత్ర జంతువనుకొనుచు భుజమున పెట్టుకొని శ్రమతో క్షీర సముద్ర తీరమునకుజేరిరి. ఈ పిల్ల పర్వత

మెత్తగలదా? యన్న సందియము లేకుండా నుండుటకు యీ భారము చూపెను. వారట్లు విడువగా కూర్మరూపుడు హరి దాని క్రిందకుపోయి మంధర గిరిని పైకి లేవనెత్తి యుంచెను. పర్వతం నిలబడుట చూచి రాక్షసులాశ్చర్యపడ సాగిరి. దేవతలు మహా ప్రభూ నీకు మా యందుండు ప్రేమ ఇంతగా చూపినావు.

నీ సాయములేకుండా మేము జీవించగలమా? మమ్ము నీ దయతో చూడుము యని ప్రార్థించి వాసుకి చెంత కుభయపక్షముల వారు పరుగెత్తిరి. ఆతని సమీపించి యిట్లు పొగడిరి. సర్పరాజా! మా కుపకారము చేయ ప్రార్థిస్తున్నాము. మహానీయుల జీవితములు పరోపకారమలెనక్షైవ్య యింతురు.

నీవు మహానుభావుడవు మమ్ముద్ధరించుమని ప్రార్థించిరి. ఆతడు వారి ప్రార్థనమూలకించి దేవ కార్యమునకు తోడ్పడుట యిహపరసాధనము గదా! నేనంగీకరింతునని యాసర్పరాజు పాల సముద్రము దరికి వచ్చి సముద్రములోనికి దిగి యామంధరపర్వతమును చుట్టుకొనెను. అప్పుడు రాక్షసులకు దేవతలకు వాదము వచ్చినది. తలదగ్గఱ యెవరుండవలెను? తోకదగ్గఱ యెవరుండ వలయును? అన్న మీమాంశలో పడగా దేవతలు నిట్లనిరి. మాకు తగువుతో పనిలేదు. మీరు గౌరవస్థానమేది యని దలచినయచటనే యుండుడు. మిగిలిన చోటులో మేముందుము. మనకు కార్యసాధనం ప్రధానమనిరి. మేము గొప్పవారముగాన తల వద్ద నుందుము మీరు తోకవద్ద నుండుడనిరి. దేవతలు సరియనిరి. అట్లు యిరువైపుల వారు పాటు కుదుర్చుకొని పర్వతమును మథించసాగిరి. మథన సమయములో

తల దగ్గరున్న రాక్షసులకు వాసుకి విషజ్వాలలు విరివిగా క్రమ్మి బాధపెట్ట సాగినవి. వారెట్లో యా బాధ సహించి మధించసాగిరి.

ప్రయాస మీద వారు పాల సముద్రమును మధించగా మధించగానందు నుండి పెద్ద మంటలతో హాలాహలమను విషము లేచినది. ఆ వేడికి యెవరు నిలబడ లేకపోయిరి. వారందరూ బెకా బెకలైరి చేయునదిలేక మరల దేవతలు రహస్య ముగా శ్రీమన్నారాయణుని జేరి యీ విషయము వివరించిరి. ఆతడు విని దేవత లారా! యీ విషము మామూలుగా చల్లబడునదికాదు దీని నెవరాపలేరు.

మీరందరూ కైలాసమునకుపోయి శివుని ప్రార్థించుడు. ఆతడు మీ బాధ తీర్చగలడనెను. అది విని దేవతలు రజితగిరికిపోయి శంకరుని దర్శించి యిట్లు ప్రార్థించిరి. మహాదేవా! శరణు శరణు నీవు చక్కని దేవుడవు. మా మొరలాల కించి దయతో చూడగల యమృత హృదయుడవు.

నీవు మా యాపద సమయంలో నడ్డుపడగల బంధుడవు. నిన్ను మించి లేరు. మాకు యీ యుపకారముచేసి మమ్ముద్ధరించగోరెదము. యీ మహా విష జ్వాలల ముందు నిలబడలేకుండాయున్నాము. మా కమృతము చేపట్టునట్లు దీనిని తగ్గించ ప్రార్థించుచున్నామని ప్రార్థించినారు. వారి మొరలు విని శంకరుడు సంతో షించి నేను మీ కుపకారము చేయుదును. ఆ విషబాధ తప్పించెదనని వాగ్దానం చేసినాడు. అతడు వెంటనే వారితో బయలుదేరి పాల సముద్రమునకు వచ్చెను. అందులో నిలబడి యా హాలాహల విషమును చేతితో దగ్గరగా ప్రోగుపెట్టి యుండగాజేసెను. ఆ యుండను శంకరుడు మహా ఫలముగాజేసి వానిని మ్రింగి కంఠమందుంచెను. క్రిందకు దిగనీయలేదు. నాటినుండి శివుని నీలకంఠుడనియు,

గరళకంఠుడనియు, శ్రీకంఠుడనియు పేర్లతో పిలుచుటకు బిరుదుగా మహా విషమును మ్రింగెను.

ఇట్లు దేవదానవులు విషజ్వాలల బాధలనుండి విడుపడిన తరువాత మరల మంథరగిరిని తరువనారంభించిరి. అట్లు చిరకాలం పాల సముద్రము తరచి తరచి శ్రమపడు సమయంలో ఐరావతమను తెల్లని ఏనుగు వచ్చెను ఉచ్చైశ్రవ మను గుర్రం వచ్చినది. ఎందరో దేవ వేశ్యలు జన్మించిరి ఆ పిమ్మట చంద్రుడుద్భ వించెను. ఆ చంద్రునితో వెనుక సర్వాలంకారయుక్తయై శ్వేతవస్త్రములు ధరించి తన చల్లని కాంతులతో కోటి చంద్రులుదయించునట్లు గన్పించుచు సుందరాంగి యొకతె యీ వలకు వచ్చెను. ఆమెయే లక్ష్మీస్వరూపిణి. సమస్త జీవకోటికి యైశ్వర్యములనిచ్చు ముఖ్యదేవత ఆమెను చూచి వారంతా తమ యదృష్టమును పొగడుకొనసాగిరి.

ఆ దేవతలు మహాలక్ష్మిని దర్శించి పాదములు పట్టుకొని వేయివేల నమస్కారములర్పించి ఇట్లు పొగడిరి. దేవి! మా యదృష్టము పండినది మా దినములు పండినవి. మమ్ము దయ చూడ నిన్ను వేడుచున్నాము. నీ చల్లని చూపులు మాపై ప్రసరింపజేయుము. నీవు దయ జూపినవాడు సర్వ పూజ్యుడు.

## లక్ష్మీ మహిమాను వర్ణనము

నీ దయ లేనివాడు నిర్భాగ్యుడు. మా సిరి పండినది. నీ దర్శనమైనది. మేము కృతకృత్యులమైనాము. నీవు మాయందు దయయుంచి మమ్ము కనిపెట్టి యోగక్షేమములు చూచుచుండు శ్రీహరిచెంతనే యుండుమని ప్రార్థిస్తున్నాము. ఆ మహానుభావుడే నిన్ను భరించగలడని వేడుకొనిరి. ఆదిలక్ష్మీదేవి శ్రీహరి వద్దకు పోయి యతని హృదయమును నివాసముగా చేసికొని నివసించసాగెను. ఆ లక్ష్మీదేవియే శుక్రగ్రహమున కధిష్ఠాన దేవతయని యెరుగమని ధర్మరాజుతో మునులు చెప్పగావిని యా ధర్మరాజు యిట్లు ప్రశ్నించెను. మునీంద్రులారా! మీరు శుక్రగ్రహాధిష్ఠానదేవత లక్ష్మీదేవియని చెప్పిరిగదా! యా దేవిమహిమలు వర్ణించ గోరెదను. అదిగాక యెవరు యా లక్ష్మీదేవి యనుగ్రహమున శుక్రదోషము వారించుకొన్నారో చెప్పమని కోరెను. ఆ మాటలువిని వారిట్లారంభించిరి.

పూర్వయుగములో నొక పేదకుటుంబమువారు బ్రాహ్మణులుండ సాగిరి. వారు ముగ్గురు సోదరులు. ఒకడు ధనములేకున్న జీవించ జాలము ధనమున కధిష్ఠానదేవత లక్ష్మీదేవి యామె నారాధించిన దరిద్రము తొలగును నేనారాధింతునని లక్ష్మీపూజ చేయసాగెను. వాని రెండవ తమ్ముడు లక్ష్మీదేవి ధనము నెట్లిచ్చును. బ్రాహ్మణుడు సరస్వతి నారాధించిన విద్యవలన ధనము దానంతటది వచ్చును. ప్రత్యేక మారాధించిన చదువులతల్లికి కోపము వచ్చును. నేను సరస్వతి నారాధింతునన్నాడు. మూడవవాడు మీరిద్దరు వెర్రివారు లక్ష్మీదేవి ధనమును సరస్వతిదేవి చదువును యిచ్చునను మాట కల్ల అన్నియు

వెఱ్ఱినమ్మకములు నిజముగా చదువుగాని ధనముగాని రావలయునన్న యోగము ప్రధానం.

ఆది లేకున్న యేవియులేవు. గతజన్మములో చేసిన పూజ బలముతో సమస్తము వచ్చునని వాదించసాగెను. ఇట్లు వారు మువ్వురు మూడురకములు నిల్చి నడచుచుండిరి. వీరి హృదయములు శోధించదలచి లక్ష్మీదేవి యిట్లాలోచించెను.



నన్నారాధించువాడు శుక్రగ్రహబలము విశేషముగా నుండిన వాడు నా దయకు పాత్రుడు. వానియందు నాకు దయకల్గినది. నేను వాని భార్యకు మంగళదాయినినై యుండి యిల్లు బాగుచేయుదును. రెండవవాడు తక్కువవాడు వాడు నా కోడలిని పూజిస్తూన్నాడు నా కుమారుడు బ్రహ్మదేవుడు. ఆతని భార్య సరస్వతి నా కోడలు వాడు నన్ను తిరస్కరించి నా కోడలిని పూజించుటచే దానియందుండు మమకారముతో ఖండన యోగములు గల్గించుచు వెనుకనే యుందును. మూడవవాడు యోగములు నమ్మినవాడుగదా! వీనికి యోగబలమెంత యున్నదో వానికెంత నమ్మకమున్నదో యెట్లు సంచరించునో చూతమని దూరముగా నుండెను. వారు వారివారి హితవుల ననుసరించి విశ్వాసముతో నుండిరి. కొంతకాలమునకు మూడవవాడు దరిద్రపీడచే క్రమంగా బాధలో పడెను. ఇల్లు నడువదు కుటుంబ భారము పెరిగినది గతములోని ధోరణితగ్గి విచారంతో నుండెను.



ఆతడట్లుండ దరిద్రం పోవుటకు మార్గమేది యేదియోయని యోచించెను. తన గ్రహబలమును గురించి యెరుగదలచి యొక శాస్త్రవేత్త నాశ్రయించెను. ఆయన గణితము చూచి యిట్లనెను నీకు యీ సమయం శుక్రగ్రహము దోష స్థానములోనున్న పాపగ్రహ దృష్టిచే యీ బాధలు పడుచున్నావు యిప్పుడు

నీ యోగము సరిగలేదు. శుక్రగ్రహము శాంతి చేసికొన్న తిరిగి నీవు శోభింతు వన్నాడు. అదివిని స్వామీ! దానికి నన్నేమి చేయమన్నారని యడిగెను వానికి సమాధానముగా శాస్త్రవేత్త యిట్లనెను. నీవు లక్ష్మి యంత్రము సంపాదించు కొనుము.

ఒక శుభదినమున చక్కగా నలికి ముగ్గులు తీర్చిన పవిత్ర ప్రదేశంలో యింటియందు పీఠమునుంచి దానిపై యంత్రముంచవలయును. పిదప కలశముంచి మండలదీక్ష గైకొనుము. నిత్యమారాధనం చేయుచు జపముగావిస్తూ శాంతి విధులతో సమాప్తము గావించినచో నీకు శుక్రగ్రహ దోషముతగ్గి లక్ష్మి ప్రసన్న మగుననెను.

ఆతడా సలహాను తన బాధలనివారణకు పాటించదలచి యా ప్రయత్నములో నుండెను. మొదటి నుండి లక్ష్మీదేవి నారాధించు నగ్రజుడగు వాని యందు దయ పుట్టిన లక్ష్మీదేవి యొకనాటి రాత్రి వాని భార్య స్వప్నంలో దర్శన మిచ్చి యిట్లనెను. ఓ సాధ్వీ! నీవు నన్ను నమ్మికొన్నావు. నీ భర్త నా యందు మితమగు భక్తితో సంచరించుచున్నాడు. మీ దంపతుల నేనుపకార చేయదలచి నాను. రేపు దాటించి యెల్లుండి రాత్రివేళ మీ గ్రామంలో యుత్తరముపైపు పుంతకు రమ్ము. నేను నీకు చేతికి చిక్కిన యిల్లు బంగారమగును. ఇతరులెవరు యెరుగకుండా యొంటరిగా రమ్ము యిది నమ్ముమని యంతర్ధానమందెను. ఈ స్వప్నము కామె యాశ్చర్యపడి సమయమునకు వేచి చూచుచుండెను. మూడవ నాడు వచ్చినది. రాత్రియగు దాక తొందరలో నున్నది. ఈ విషయం భర్తకు చెప్పలేదు పర్యవసానం చూచిగాని చెప్పకూడదనుకొని యున్నది.

నిజంగా నాకు లక్ష్మి వచ్చునా? నమ్మదగినదా? భయం సంతోషం నిండిన హృదయంతో నాపై యా సమయమునకు బయలుదేరి వెళ్ళినది. లక్ష్మీదేవి కటాక్షముతో నామె ముందునొక బిందె కన్పించినది. అది బరువుగా కాసులతో నిండియున్నది. దానిని పైకెత్తలేక యెత్తి భుజమున పెట్టుకొని నీళ్ళబిందెవలె తెచ్చినది. యింట దింపినది. బరువుగా దింపుట భర్త విని భార్య నీళ్ళు తెచ్చుటకు పోయినదా? యని చూచి యా బిందెను దీపము వెలుగున చూచెను మిలమిల మెరయుచుండు సువర్ణ నాణెములు నిండిన దానిని చూచి లక్ష్మీకటాక్షమని సంతోషించిరి.

రెండవవాడు సరస్వతి నుపాసించసాగెను. ఆమె దయగల్గినది. యిది పరులోనే తన కోడలు గదా! యను యభిమానముంచుకొని తన తరువాత స్థానం కోడలిదని నిర్ణయించి యొక మహారాజు సంస్థానములో గొప్ప పండితునిగా ప్రవేశ పెట్టించెను. ఆయన వలన బహుమానములు, మణులు, మాన్యములు పొంది సుఖించెను.

మూడవవాడు యా గురుడుపదేశించినట్లు తన దోషము గుర్తించి యోగముకూడ గ్రహబలముతోనే యుండును. నేను వెర్రినై పొరపడితిని. ఇప్పుడు తప్పక నా దోష పరిహారమునకాయన చెప్పినట్లాచరించెదనని నిశ్చయించుకొనెను. ఒక శుభదినమున లక్ష్మీ యంత్రమును సంపాదించి దానిని శుచి ప్రదేశములోనుంచి కలశ స్థాపన గావించి దీక్ష గైకొనెను. ఆ దీక్షా దినములలో లక్ష్మీ మంత్రజపం గావిస్తూ సహస్ర నామములతో పూజలు చేయుచు మండలదీక్షలో

నుండెను. ఆతడు బుద్ధి మరల్చుకొని యిట్లుండి కొనసాగించుచుండగా వానికి శుక్రగ్రహదోషము సన్నగిల్లసాగినది. ఆతని యందభిమానముంచిన లక్ష్మీదేవి వాని నుద్ధరించదలచెను. ఆమె దయ కుదురుటచే యొక ధనవంతుని స్వప్నంలో దర్శనమిచ్చి యిట్లనెను.

ఓయీ! నీవు నా భక్తుడగు బ్రాహ్మణునకు భూమిలో నొకభాగము పూజాధికముల పోషణకు రేపే దానపట్టా వ్రాసియిమ్ము. దానిని వాడు నా పూజ చేయుటకు ముడుపుగా పుచ్చుకొనగలడు నీకు దీనికి ప్రతిగా యింతకన్న హెచ్చు సొమ్ము ముట్టచెప్పెదనని యాజ్ఞాపించెను. ఆతడట్లే చేసెను. దానితో వానికి శుక్రగ్రహదోషము నివారణమై సుఖించెను. ఇది ధర్మరాజా! నవగ్రహముల దోషములకు శాంతివిధానము. వారికి యోగ ప్రాప్తి గల్గు విషయం వివరించినాము, దీనిని చదివినను విన్నను నవగ్రహదోషములు శాంతించును. ఏయే గ్రహమునకు యేయే దోషశాంతియో వివరించితిమి. దీనిని నీవు గుర్తించి శుభములు పొందుమని యుపదేశించిరి.

నవగ్రహ పూజా మహిమ

సమాప్తము